Islam Aur Jahilyat
(Telugu)

# ఇస్లామ్ మరియు అజ్ఞానం

మూలం
మౌలానా మౌదూది (రహ్మాలై)

అనువాదం
ఎస్.ఎమ్. మలిక్

అపార కరుణామయుడు పరమకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# బుద్ధే నా మార్గదర్శి!

## భూమిక

మనిషి తన మనుగడ కొరకు ప్రపంచంలోని వివిధ వస్తు సామగ్రితో తన సంబంధాలను ఏర్పరచుకుంటాడు. అయితే ఆ పదార్థం ఏమిటీ? అదెలా ఉనికిలోకి వచ్చింది? దానితో తాను ఎలాంటి సంబంధం ఏర్పరచుకోవాలి? అన్న ప్రశ్నలకు సంతృప్తికరమయిన సమాధానం లభ్యం కానంతవరకు అతను దానితో ఎలాంటి సంబంధమూ ఏర్పరచుకోలేడు. అతని ఈ అన్వేషణలో సంప్రాప్తమయ్యే సమాధానాలు స్వతహాగా సరయినవా? కావా? అన్న ప్రశ్న అలా ఉంచి ఎలాగయినా వీటికి సమాధానాలు పొంది వాటిని గురించి ఏదో ఒక అభిప్రాయం అతను ఏర్పరచుకోవలసి వస్తుంది. అప్పుడే అతను ఆ పదార్థాలతో తాను అవలంబించవలసిన వైఖరిని నిర్ణయించుకోగలుగుతాడు. ఇది మన దైనందిన అనుభవం.

మీరు ఒక వ్యక్తిని కలుసుకుంటే ఆ వ్యక్తి ఎవరు, ఏ స్థాయి స్థితిగతులకు చెందినవాడు, ఎలాంటి గుణగణాలవాడు, అతనితో మీ సంబంధం ఎలాంటిది? అన్న విషయాలు ముందు నిర్ణయించుకోవలసి ఉంటుంది. అలా కాకపోతే అతనితో మీరు ఏ విధంగా వ్యవహరించాలో నిర్ణయించుకోనే లేరు. ఈ విషయాల 'జ్ఞానం' లేకపోయినా కనీసం ఊహ ద్వారానయినా మీరు వీటిని నిర్ధారించుకోవలసి ఉంటుంది; మీరు అతనితో ఏ వైఖరిని అవలంబించినా, ఆ ఊహ ప్రకారమే నిర్ణయించుకుంటారు.

మీరు తినే పదార్థాలను మీరు ఎందుకు తింటారు? 'జ్ఞానం' లేక 'ఊహ' ప్రకారం అవి మీ ఆహార అవసరాలను తీర్చగలుగుతాయి కాబట్టి. మీరు వ్యర్థమని భావించి పారేసే పదార్థాలు, వాడుకునే వస్తువులు, మీరు దాచి భద్రపరచుకునే సామగ్రి, మీరు గౌరవంగా ఆదరించే లేక ఏహ్యంగా చూచే, మీరు భయపడే లేక ప్రేమించే పదార్థాలన్నిటి ఎడల మీ ప్రవర్తనకు అసలు కారణం ఏమిటి? మీరు వాటి గుణగణాలు లక్షణాలను గురించి, వాటితో తమ సంబంధాలను గురించి ఏర్పరచుకున్న అభిప్రాయమే నిజమయిన కారణం అన్నది నిర్వివాదాంశం.

అయితే ఒక్క విషయం. మీరు పదార్థాలను గురించి ఏర్పరచుకున్న అభిప్రాయం సరైనదైతే వాటిపట్ల మీ వైఖరి కూడా సవ్యంగా ఉంటుంది. అభిప్రాయం తప్పయినదైతే మీ వైఖరికూడా అపసవ్యంగా, తప్పుగా ఉంటుంది. అంటే మీ వైఖరి యొక్క తప్పొప్పులు మీరు ఆ పదార్థం గురించి ఏర్పరచుకున్న అభిప్రాయంపై ఆధారపడి ఉంటాయన్నమాట.

అలాగే, మీరు ఏర్పరచుకున్న అభిప్రాయానికి ఆధారమేది? ఈ అభిప్రాయం మీరు 'జ్ఞానం' ఆధారంగా ఏర్పరచుకున్నారా? లేక 'ఊహ'పై మీ అభిప్రాయం ఆధారపడిఉందా? లేక కేవలం 'ఇంద్రియ జ్ఞానం' మీ అభిప్రాయానికి మూలమా? మీ అభిప్రాయం సరైనదా లేక తప్పయినదా? అన్న విషయం దాని మూలాధారంపై ఆధారపడి ఉంటుందన్నమాట.

ఈ మాటను ఒక ఉదాహరణ ద్వారా అర్థం చేసుకుందాం; ఒక పసివాడు ఎర్రగా కణకణలాడే అగ్నికణాన్ని చూస్తాడు, అది అతనికి మెరుస్తూ అందంగా అగుపడుతుంది. అతను తన 'ఇంద్రియ జ్ఞానం' మూలంగా, అదొక సొగసైన బొమ్మగా దాన్నిగురించి అభిప్రాయం ఏర్పరచుకుంటాడు. ఈ అభిప్రాయంరీత్యా దానిపట్ల అతని వైఖరి ఎలా ఉంటుంది? దాన్ని తన చేతుల్లో తీసుకుని ఆడుకోవాలని చెయ్యి చాచి పట్టుకునేందుకు ముందుకు వస్తాడు.

మరో వ్యక్తి ఆ అగ్నికణాన్ని చూచి తన ఊహాకల్పనల ద్వారా అగ్నే దైవమని లేదా దైవాంశ సంభూతమైన పదార్థమని అభిప్రాయపడతాడు. ఈ అభిప్రాయం ప్రకారమే తన వైఖరిని నిర్ణయించుకుంటాడు. ఆ వైఖరి ఏమిటి? దాని ముందు తల ఒగ్గడం, దాని ఎదుట తన భక్తి ప్రపత్తుల్ని వెదజల్లడం.

మూడో వ్యక్తి అదే అగ్ని కణాన్ని తిలకిస్తాడు. అదేమిటో దాని లక్షణాలేమిటో పరిశోధిస్తాడు. జ్ఞానం, పరిశోధనల ద్వారా ఇది వేడినిస్తుందని, వంటకు, దేన్నయినా కాల్చడానికి, చలి కాచుకోడానికి ఉపకరించే పదార్థమని అభిప్రాయపడతాడు. దీనితో తనకున్న సంబంధం పనిముట్టు - పనివాడు లాంటిదని భావిస్తాడు. ఈ అభిప్రాయం, ఈ భావం కారణంగా దాని యెడల అతను అవలంబించే వైఖరి ఏమంటే, అవసరాన్నిబట్టి వంట చేసుకోడానికి, కాల్చడానికి, చలి కాచుకోడానికి దాన్ని వినియోగించుకుంటాడు. అంతేగాని, అగ్నిని ఆటవస్తువుగా చేసుకోడు, లేక అరాధ్య దైవంగానూ భావించడు.

ఈ విభిన్న వైఖరుల్లో; కేవలం ఇంద్రియజ్ఞానం ఆధారంగా ఏర్పడిన పిల్లవాని అభిప్రాయం, ఆ అభిప్రాయంవల్ల నిర్ణయమైన అతని వైఖరి మూఢత్వపు వైఖరి. ఎందుకంటే, అనుభవం ద్వారా 'అగ్నికణం ఓ ఆటవస్తువు' అన్న పిల్లవాని అభిప్రాయం తప్పుగా రుజువవుతుంది. అలాగే కేవలం 'ఊహ' ద్వారా ఏర్పడిన అగ్ని పూజారి అభిప్రాయం, ఆ అభిప్రాయం ప్రాతిపదికగా అతడు అవలంబించ దలచుకున్న వైఖరికూడా మూఢత్వపు వైఖరే. ఎందుకంటే, అగ్నే దైవం అని లేదా దైవాంశసంభూతమైన పదార్థమని అతడు ఊహించిన అభిప్రాయం ఏ శాస్త్రీయ నిరూపణపై ఆధారపడిలేదు. కేవలం ఊహాజనితమే. అయితే అగ్నిని ఒక పరికరంగా వాడుకోదలచిన వ్యక్తి వైఖరి శాస్త్రీయ వైఖరి. ఎందుకంటే అగ్ని ఒక పరికరం అని అతడు తీసుకున్న నిర్ణయం శాస్త్రీయ నిరూపణలపై ఆధారభూతమయి ఉంది.

## మౌలిక సమస్యలు

పైన పేర్కొన్న విషయాల్ని గుర్తుంచుకోండి. మీ దృష్టిని కాస్త విస్తృతంచేసి నిమ్న విషయాలపై నుండి ముఖ్య విషయాలపైకి పోనివ్వండి, ఇక చూడండి.

మనిషి కళ్ళు తెరవగానే ప్రథమంలో తనను తాను చూసుకుంటాడు. అతనికో శరీరముంది, అందులో అనేక శక్తులున్నాయి. అతని ఎదుట భూమ్యాకాశాలు, వాటిలోని అసంఖ్యాక వస్తుసామగ్రి వడ్డించిన విస్తరిలా పరిచి ఉన్నాయి. తనకు ఆ వస్తువులను వినియోగించే శక్తి ఉన్నట్లు అతడు గుర్తిస్తాడు. అతని చుట్టూ ఎందరో మానవులు, ఎన్నో రకాల జంతువులు, మరెన్నో చెట్లు, గుట్టలు ఉన్నాయి. వీటన్నిటితో అతని జీవితం ముడివడి ఉంది.

ఇప్పుడు మనిషి స్వయంగా తన గురించి, తన చుట్టూ ఉనికిగల వాటిని గురించి, వాటితో తనకు ఏర్పడగల సంబంధం గురించి ఒక నిర్ణయం గైకొనకుండా ఆ పదార్థాలతో ఏ విధంగానయినా వ్యవహరించగలడని మీరు నమ్మగలరా?

తానెవడో, తన నిజ స్థానమేదో, తాను బాధ్యుడయిన జీవియో కాదో, తాను స్వతంత్ర ప్రతిపత్తిగలవాడో, పరాధీనుడో, పరాధీనుడయితే ఎవరికీ? జవాబుదారుడయితే ఎవరి సమక్షంలో? తన ఈ ప్రాపంచిక జీవితానికి పరమార్థమేదయినా ఉందా? ఉంటే అదేమిటి? ఇలాంటి అనేక ప్రశ్నలకు సమాధానం దొరకనంతవరకు తన జీవితానికి ఏదయినా బాటను నిర్ణయించు కోగలడా?

అలాగే, ఈ శరీరం, ఇందులోని శక్తులు ఇతని సొంతమా లేక మరెవరయినా ప్రదానం చేసినవా? వీటి లెక్కలు చూచే వారెవరయినా ఉన్నారా? లేరా? వీటిని వినియోగించుకునే నిబంధనావళిని తానే నిర్ణయించు కోవాలా? లేక మరెవరయినా నిర్ణయిస్తారా? అన్న విషయాలు తెల్చుకోనంతవరకు తన శక్తుల ఉపయోగమేమిటో తీర్మానించుకోగలడా?

ఇంకా తన చుట్టూ ఉన్న వివిధ పదార్థాల అసలు యజమాని తానా? కాక మరెవరయినా ఉన్నారా? వీటిపై తన అధికారాలు పరిమితమయినవా? లేక అపరిమితమయినవా? పరిమితమయినవయితే హద్దులు నిర్ణయించేదెవరు? అన్న సంగతి క్షుణ్ణంగా తెలుసుకోనిదే అతడు ఆ పదార్థాల ఎడల ఒక విధానాన్ని అవలంబించగలడా?

మానవత అంటే ఏమిటో, మనిషీ మనిషికీ మధ్య ఉన్న భేదమేమిటో, ఆ విభేదానికి ఆధారమేమిటో, ఒకరితో స్నేహం చెయ్యాలన్నా, శతృత్వం వహించాలన్నా, ఏకాభిప్రాయం కలగాలన్నా, భేదాభిప్రాయం రావాలన్నా, ఒకరితో సహకరించాలన్నా లేక సహకారాన్ని నిరాకరించాలన్నా - ఈ సకల విషయాలు ఏ ప్రాతిపదికపై ఆధారపడి ఉంటాయి? అనే విషయంలో ఒక నిర్దిష్టమయిన నిర్ణయం గైకొననంతవరకు అతడు తోటి మానవులతో అవలంబించే వైఖరి రూపొందించుకోగలడా?

ఈ విధంగా, ఈ సకల విశ్వవ్యవస్థ ఎలాంటిదో, ఇందులో తన పాత్ర ఏమిటో ఇదమిత్థంగా బోధపడనంతవరకు అతడు ఈ ప్రపంచంలో తాను వ్యవహరించవలసిన తీరును ఏ విధంగా నిర్ణయించుకో గలుగుతాడు?

వాస్తవమేమంటే ఈ విషయాలన్నిటిలో ఏదో ఒక నిర్ణయానికి రాకుండా ఒక నిర్దిష్ట వైఖరిని అవలంబించడం సాధ్యపడదు. క్రియాత్మకంగా ప్రపంచంలో మనుగడ సాగిస్తున్న ప్రతి మనిషి ఈ ప్రశ్నలకు సంకల్పికంగానో, అసంకల్పికంగానో ఏదో ఒక అభిప్రాయం కలిగి ఉంటాడు - అలా కలిగి ఉండటం అతనికి తప్పనిసరికూడా. ఎందుకంటే ఈ అభిప్రాయం లేకపోతే అతడు ఏ పనికూడా చెయ్యలేడు.

ప్రతి వ్యక్తి తప్పనిసరిగా ఈ ప్రశ్నలపట్ల తాత్వికంగా ఆలోచించి, చర్చనీయాంశాలు నిర్ణయించి, ఒక్కొక్క ప్రశ్నకు సమాధానాలు వెదకి ఉండవలసిన అవసరం లేదు. చాలామంది ఈ ప్రశ్నలపట్ల సమగ్రంగా ఆలోచించివుండరు,

వారికి వీటిని గురించి తెలిసయినా ఉండదు. అయినప్పటికీ ప్రతివ్యక్తి, ముక్తసరిగా, ఈ ప్రశ్నలను గురించి అవుననో కాదనో ఒక అభిప్రాయానికయితే తప్పకుండా వచ్చి వుంటాడు. ఇంకా అతని జీవితంలో అతడు అవలంబించే వైఖరి ఏదైనా అది అతని ఆ అభిప్రాయాన్ని ప్రతిబింబించేదిగానే ఉండటం అనివార్యం.

## వ్యక్తులయినా, సమాజమయినా...

ఈ విషయం వ్యక్తులకు ఏవిధంగానయితే వర్తిస్తుందో, అదేవిధంగా సమాజాలకూ వర్తిస్తుంది. ఇవి మానవ జీవితానికి సంబంధించిన మౌలిక ప్రశ్నలు కాబట్టి, ఈ ప్రశ్నలకు నిర్దిష్టమయిన సమాధానాలు ప్రాప్తం కానంతవరకు సంస్కృతీ నాగరికతల వ్యవస్థకు, ఒక సామూహిక రూపానికి సంబంధించిన ఆచరణా సంవిధానం రూపొందించటమే సాధ్యపడదు.

ఈ ప్రశ్నలకు ఏ విధమయిన సమాధానాలు లభ్యమవుతాయో అలాంటిదే ఒక నైతిక దృక్పథమేర్పడుతుంది. దాని ప్రకారమే జీవితపు వివిధ రంగాల వ్యవస్థీకరణ జరుగుతుంది. ఆ సమాధానాలు కోరే రంగునే సంస్కృతీ నాగరికతలు పులుముకుంటాయి. యదార్థమేమంటే, ఒక వ్యక్తి విషయమయినా, ఒక సమాజం వ్యవహారమైనా, ఈ ప్రశ్నల సమాధానాల పంథాలోనే అది మలచబడుతుంది. ఇందులో విభేదానికి ఏమాత్రం తావులేదు.

ఒక వ్యక్తి లేక ఒక సమాజం యొక్క వైఖరిని విశ్లేషించి ఆ వైఖరికి పునాదిగా పనిచేసే ఆ ప్రశ్నలకు సమాధానాలేవో సునాయాసంగా తెలుసుకోవచ్చు. ఎందుకంటే, ఒక వ్యక్తి వైఖరి లేదా ఒక సమాజం వైఖరి ప్రత్యేకవిధంగా ఉండి ఆ వ్యక్తి లేక సమాజం దృష్టిలో ఈ ప్రశ్నల సమాధానాలు మరో విధంగా ఉండటం అన్నది అసంభవం. వ్యక్తుల నోటిమాటలకు, వాళ్ళ నిజవైఖరికీ తేడా ఉండటం సంభవమే, కాని, ఈ ప్రశ్నలకు ఆ వ్యక్తుల ఆంతర్యంలో ఉన్న

వాస్తవమయిన సమాధానాలకు మరియు వారి నిజవైఖరికి మధ్య ఎన్నటికీ వ్యత్యాసం ఉండదు.

సరే, ఇంకా కాస్త ముందుకెళ్ళి చూద్దాం. మనం పై పంక్తుల్లో జీవితపు కొన్ని మౌలిక సమస్యల్ని గురించి తెలుసుకున్నాం. వాటి పరిష్కారం ఇదమిత్థంగా తేలనంతవరకు మనిషి ప్రపంచంలో ఒక్క అడుగూ వెయ్యలేడని కూడా గుర్తించాం. వాస్తవికతా దృక్పథంతో చూస్తే ఇవన్నీ అసలు 'అజ్ఞాత విషయాలకు సంబంధించినవే. వీటి సమాధానాలు లేక పరిష్కారాలు మనిషి కళ్ళు తెరవగానే ఆకాశపుటంచుల్లో కనబడవు లేదా ప్రతి వ్యక్తికి తామై అర్థమవడానికి ఇవి అంత ప్రస్ఫుటమైనవీ, సులువయినవీ కూడా కావు. ఈ కారణాల వల్ల ఈ సమస్యలపట్ల మనుషులందరూ ఏకాభిప్రాయంతో ఒకే పరిష్కారానికి, ఒకే సమాధానానికి వచ్చేందుకు వీల్లేదు. ఈ సమస్యల సమాధానాలను గురించి ప్రజల్లో సదా భేదాభిప్రాయం ఉండింది. నిత్యం వివిధ ప్రజలు విభిన్న విధాలుగా వీటిని పరిష్కరిస్తూ వచ్చారు. అయితే ఇప్పుడు మిగిలిన ప్రశ్న ఏమంటే ఈ సమస్యల్ని పరిష్కరించేందుకు సాధ్యమయిన విధానాలేవి? ప్రపంచంలో ఇంతవరకు ఆ ప్రశ్నల్ని ఎన్ని విధాలుగా పరిష్కరించడానికి కృషి జరిగింది? ఆ పరిష్కారాలవల్ల ఉద్భవించిన పరిణామాలేవి?

పరిష్కారానికి ఒక మార్గం, మనిషి తన జ్ఞానేంద్రియాల భరోసాపై, వాటికి గోచరించిన విధంగా ఈ విషయాల్లో ఒక నిర్ణయానికి రావడం. రెండో మార్గం, ఇంద్రియ జ్ఞానంతో పాటు ఊహాకల్పనాశక్తినీ మేళవించి నిర్ణయం తీసుకోవడం.

మూడో మార్గం, ఏ వ్యక్తులయితే 'అసలు యదార్థం' యొక్క ప్రత్యక్ష జ్ఞానం ఉందని వాదిస్తారో, వారు తెలిపిన సమాధానాలను, పరిష్కారాలను స్వీకరించడం.

ప్రపంచంలో ఇంతవరకు ఈ మూడు పద్ధతుల ద్వారానే ఈ ప్రశ్నల పరిష్కారానికి కృషి జరిగింది. బహుశా ఈ మూడు పద్ధతులే సాధ్యం కూడానేమో!

---

వీటిలో ప్రతి విధానం ఓ ప్రత్యేకవిధంగా ఈ సమస్యల్ని పరిష్కరిస్తుంది. ప్రతి దాని ద్వారా ఓ ప్రత్యేక వైఖరి రూపుదాల్చుతుంది. తద్వారా ప్రత్యేక సంస్కృతి నాగరికతల వ్యవస్థ నిర్మాణమవుతుంది. ఈ వ్యవస్థ తతిమ్మా పద్ధతుల ద్వారా ఏర్పడ్డ వైఖరులకు భిన్నంగా ఉంటుంది. అయితే ఈ విభిన్న పద్ధతులవల్ల ఏర్పడే పరిష్కారాలేవో, వాటిద్వారా ఉనికిలోకి వచ్చే వైఖరు లెలాంటివో చూద్దాం.



# బుద్ధిచూపే మార్గమేది?

## అచ్చమయిన అజ్ఞానం

మనిషి జ్ఞానేంద్రియాలపై భరోసా చేసి జీవితపు ఈ మౌలిక సమస్యలను గురించి ఏదో ఓ అభిప్రాయానికి వస్తాడు. ఈ ఆలోచనాసరళి దాని నైజానికి అనుగుణంగా మనిషిని ఓ ప్రత్యేక పరిణామానికి చేరువ చేస్తుంది. దాని పర్యవసానంగా ఈ సమస్యల సమాధానం పట్ల అతడు తీసుకునే నిర్ణయం ఇలా ఉంటుంది:

"ఈ విశ్వవ్యవస్థ అంతా కాకతాళీయంగా ఉనికిలోకి వచ్చి వ్యవహరిస్తోంది. దీని కార్యకలాపాల వెనుక ఎలాంటి హేతువూలేదు మరే ఉద్దేశ్యమూలేదు. అంతా ఉట్టిగనే ఏర్పడింది, అర్థం లేకుండానే నడుస్తోంది, నిష్ప్రయోజనంగానే అంతమైపోతుంది. దీనికి ఒక కర్త అంటూ ఒక యజమాని అంటూ ఎవరూ కానరావడం లేదు. అందువల్ల లేడనీ చెప్పవచ్చు. ఉన్నా మానవ మనుగడతో అతనికి ఎలాంటి సంబంధం లేదని కూడా చెప్పవచ్చు.

"మనిషి నిజానికి ఓ జంతువు. బహుశా కాకతాళీయంగానే పుట్టి ఉంటాడు. యదార్థానికి, ఇతడు తానై పుట్టాడో లేదా మరెవరయినా పుట్టించారో ఇదమిత్థంగా చెప్పలేము. అయినా ఈ విషయం అంతగా చర్చనీయాంశం కాదు. మనకు తెలిసిందల్లా ఒక్కటే; మనిషి ఈ భూమిపై వస్తున్నాడు. అతనికి కొన్ని కోరికలున్నాయి. వాటిని నెరవేర్చుకునేందుకు అతని అంతర్యం బలవత్తరంగా అతన్ని పురికొలుపుతుంది. అతనికి కొన్ని శక్తులు, కొన్ని సాధనాలూ ఉన్నాయి. వాటి ద్వారా అతడు తన ఆ కోరికల్ని నెరవేర్చుకోగలడు.

"మనిషి చుట్టూ భూమిపై అసంఖ్యాకమయిన వస్తుసామగ్రి విస్తారంగా లభిస్తుంది. వాటిపై అతడు తన శక్తిని, సాధనాలను వినియోగించి తన వాంఛల పరిపూర్తి చేసుకోగలడు. అందువల్ల అతనికున్న శక్తుల వినియోగం ఒక్కటే - మనిషి కోరికల్ని, అవసరాల్ని ఇతోధికంగా, అత్యంతపరిపూర్ణంగా నెరవేర్చడం - అంతే తప్ప మరేదీ కాదు. అలాగే ప్రపంచం అంటే మరేమీ కాదు. వడ్డించిన ఓ విస్తరి తప్ప! దీన్ని రెండు చేతులతో సొంతం చేసుకుని ఆస్వాదించడమే మనిషి కర్తవ్యం. మనిషిని అడిగే అధికారంగల శక్తి ఏదీ లేదు. మనిషి ఎవరికీ సమాధానం చెప్పుకోవలసిన అగత్యమూ లేదు.

"మనిషి జీవితానికి ఓ ప్రత్యేక నియమావళి అంటూ లేదు. అలాంటి నియమావళి ప్రదానంచేసే, మార్గదర్శకత్వం వహించగలిగే జ్ఞానకేంద్రం, శక్తికూడా ఏదీలేదు. అందువల్ల మనిషి స్వతంత్ర ప్రతిపత్తిగల జీవి. ఎలాంటి బాధ్యతా లేని స్వేచ్ఛా జీవి. తన జీవితం కొరకు ఓ నియమావళిని రూపొందించుకోవడం, తన శక్తుల వినియోగం నిర్ణయించుకోవడం, ప్రపంచంలో ఉన్నవాటి ఎడల తన ప్రవర్తనను నిర్ణయించుకోవడం అంతా అతని ఇష్టమే. అంతా అతని హక్కే. ఒకవేళ మనిషి జీవితానికి ఏదైనా మార్గదర్శకత్వం, ఆదర్శం కాగలదంటే అది జంతు జీవితంలోనూ, శిలాజాల గాథలలోనూ, లేదా స్వయంగా మనిషి చారిత్రక అనుభవాల్లోనూ లభిస్తుంది.

"మనిషి ఎవరికయినా జవాబు చెప్పుకోవలసి ఉందంటే అది తన స్వయానికే. లేదా మానవుల్లో నుంచి ఉద్భవించి మానవులపై పెత్తనం చెలాయించగల తోటి మానవుల అధికారానికే. అంతేకాని మానవాతీత శక్తులు వేటికీ మనిషి బదులు చెప్పుకోవలసిన అవసరం లేదు.

"జీవితం అంటే ఈ ప్రాపంచిక జీవితమే. మనిషి చేసే పనుల, చర్యల ఫలితాలు ఏవైనా యేర్పడితే అవి కేవలం ఈ జీవితం వరకే పరిమితం. అందువల్ల యే మాటైనా, యే ఆలోచన అయినా, యే పనయినా, యే చర్య అయినా, అది సరయినదో కానిదో, అది ప్రయోజనకరమో నిష్ప్రయోజనమో, అది అనుసరణయోగ్యమో కాదో నిర్ణయించాలంటే దాని పరిణామం ఈ ప్రపంచంలో ఎలా బహిర్గతమవుతుందో చూడవలసి ఉంటుంది. తదనుగుణంగానే దాని స్థానం తేల్చవలసి వుంటుంది."

## జీవన దృక్పథం

ఇదీ జ్ఞానేంద్రియాల ఆధారంగా ఏర్పడే ప్రపంచానికి సంబంధించిన దృక్పథం. ఇది వాస్తవానికి ఒక సంపూర్ణమయిన జీవన దృక్పథం. దీనిలో జీవితానికి సంబంధించిన మౌలిక సమస్యలన్నింటికీ జ్ఞానేంద్రియాల అనుభవం మూలకంగా సమాధానాలు ఇవ్వడం జరిగింది. ఈ సమాధానాల్లోని ప్రతి అంశం మరో అంశంతో అవినాభావ సంబంధం కలిగి ఉంది. ఆ సంబంధం, తార్కికంగా, స్వభావపరంగా పరస్పరానుకూలత కలిగి ఉంది. తన్మూలంగా మనిషి వైఖరి ఈ ప్రపంచంలో సాఫీగా, సమంగా రూపొందగలదు. అయితే ఈ సమాధానాలు వాటి ఆధారంగా ఏర్పడే ఈ వైఖరి సరైనదా? కాదా? అన్నది వేరే విషయం.

ఇక ఈ సమాధానాలు, ఈ దృక్పథం ఆధారంగా మనిషి ప్రపంచంలో అవలంబించే వైఖరి ఎలాంటిదో గమనిద్దాం.

## వ్యక్తి

మనిషి యొక్క వ్యక్తిగత జీవితంలో ఈ దృక్పథంవల్ల ఉద్భవించే తప్పనిసరి పరిణామం ఏమిటంటే, మనిషి ఆమూలాగ్రంగా స్వేచ్ఛాయుత మరియు బాధ్యతారహితమైన వైఖరి నవలంబిస్తాడు. అతడు, తానే శరీరానికి, శారీరక శక్తులకు స్వామి అని భావిస్తాడు. అందువల్ల తన ఇష్టానుసారం తాను

కోరినట్లు వాటిని ఉపయోగిస్తాడు, ప్రపంచంలోని ఏ ఏ పదార్థాలు అతని అధీనంలోకి వస్తాయో వాటినన్నిటినీ, యేయే మనుషులపై అతనికి అధికారం ప్రాప్తమవుతుందో వారందరికీ తానే యజమాని అయినట్లు వ్యవహరిస్తాడు. అతని ఈ అధికార పరిధుల్ని పరిమితం చేయగల శక్తి దేనికీ ఉండదు. కేవలం ప్రకృతి సిద్ధాంతాలవల్ల ఏర్పడే అవరోధాలకు, సామాజిక జీవితపు ప్రతిబంధకాలకు మాత్రమే ఈ శక్తి లభిస్తుంది. అతడు కళ్ళెం లేని గుర్రంగా మారకుండా ఆపడానికి స్వయంగా అతని అంతర్యంలో ఎలాంటి నైతిక ప్రేరణ, బాధ్యతాభావం, బదులు చెప్పవలసిన భయం లాంటివి యే మాత్రం ఉండవు.

బాహ్యంలో యే అవరోధాలూలేనిచోట, లేదా అలాంటి అవరోధాలున్నా అతడు తన పని నెగ్గించుకో గలిగేచోట, అతని ఈ దృక్పథం దృష్ట్యా, ఈ విశ్వాసం రీత్యా, అతడు దౌర్జన్యపరుడుగా, అవిశ్వసనీయుడుగా, దుర్మార్గుడుగా, కల్లోల జనకుడుగా అవడమే సహజ పరిణామం. ప్రకృతి సిద్ధంగా అతడు స్వార్థపరుడు, భౌతికారాధకుడు, అవకాశవాది అయి ఉంటాడు. అతని జీవిత ధ్యేయం, కేవలం తన మనోవాంఛల పాశవికావసరాల పరిపూర్తి మాత్రమే. అతని ఈ జీవిత ధ్యేయాన్ని సాధించడం కొరకు ఏమాత్రమైనా తోడ్పడే విలువగల విషయాలకే అతని దృష్టిలో నిజమయిన విలువ అంటూ ఉంటుంది.

వ్యక్తుల్లో ఈ స్వభావ స్వరూపాలు జనించడం ఈ విశ్వాసం యొక్క సహజమైన తార్కిక పర్యవసానం. అయితే, సమయానుకూల అవసరాలదృష్ట్యా, దూరపు ఆలోచనల కారణంగా ఇలాంటి మనిషిలో సానుభూతి, త్యాగబుద్ధి, జాతి యోగక్షేమాలకై కృషి చెయ్యడం లాంటి గుణాలు ఉద్భవించడం, మనిషి బాధ్యతాయుతునిగా వ్యవహరించడం సాధ్యమే. కాని మీరు అతని ఈ వైఖరిని విశ్లేషించి దాని వెనుక ఉన్న ప్రేరణను తెలుసుకుంటే తేలేదేమంటే, ఈ సద్గుణాలు సైతం అతని స్వార్థానికి, మనో కాంక్షల దాస్యానికి ప్రతీకలే. అతడు తన దేశం లేక తన జాతి శ్రేయంలోనే తన శ్రేయం ఇమిడి ఉందని తలుస్తాడు.

అందుకే జాతి లేక దేశ శ్రేయాన్ని కాంక్షిస్తాడు. ఈ కారణంవల్లనే ఇలాంటి వ్యక్తి మహా అయితే ఒక "నేషనలిస్టు"గా మాత్రమే రూపొందగలడు. అంతకు మించి మానవీయత అతనిలో వెదకడం నిరర్థకం.

## సమాజం

ఇలాంటి వ్యక్తులతో ఏర్పడే మానవ సముదాయం యొక్క విలక్షణమైన ప్రత్యేకతలు ఇలా ఉంటాయి:

1. రాజకీయవ్యవస్థ మానవ సార్వభౌమాధికారం ప్రాతిపదికపై స్థాపించబడుతుంది. ఆ అధికారం ఒక వ్యక్తి, ఒక కుటుంబం లేక ఒక వర్గానిదయినా కావచ్చు. లేదా ప్రజలందరిదయినా కావచ్చు. ఈ దృక్పథం ప్రకారం ఏర్పడే అత్యధికంగా ఉన్నతమైన సాముదాయిక భావం కామన్‌వెల్తు (Common Wealth) లాంటిది. ఇలాంటి రాజ్యంలో శాసన నిర్మాతలు మానవులే. శాసనాలన్నీ మానవుల మనోకాంక్షల ఆధారంగానో, మానవ అనుభవం ప్రాతిపదికగానో, సమయానుకూల నీతి ననుసరించియో నిర్మించబడతాయి. ఈ ఆధారాలపైనే అవి మార్చబడతాయి కూడా. ప్రయోజనాల దృష్ట్యా, సమయానుకూల అవసరాల దృష్ట్యా పాలిసీలు విధానాలు రూపొందించ బడతాయి, మార్చబడతాయి.

ఇలాంటి రాజ్యపరిధుల్లో, అందరికంటే శక్తిమంతులు, అందరికంటే చతురులు, నేర్పరులు, జిత్తులమారులు, మోసకారులు, పాషాణ హృదయులు, దుష్టమనస్కులు మాత్రమే ప్రాబల్యం వహించి పైకి రాగలుగుతారు. సమాజాన్ని నడిపించడం, రాజ్యాన్ని పరిపాలించడం వీరి చేతుల్లోనే ఉంటుంది. వీరి రాజ్యాంగంలో శక్తికే సత్యమనీ అశక్తతకే అసత్యమని పేరు.

2. నాగరికత సామాజిక వ్యవస్థలన్నీ మనోకాంక్షల దాస్యంపై ఆధారభూతమై ఉంటాయి. సమాజంలో కోరికలే రాజ్యమేలుతాయి. రుచులను

ఇతోధికంగా జుర్రుకోవాలన్న కోరిక నైతిక ప్రతిబంధకాలను త్రెంచుకొని విచ్చలవిడిగా విహరిస్తుంది. నైతిక ప్రమాణాలన్నింటినీ, కోరికల్ని సంతృప్తపరిచే మార్గాల్లో వీలయినంతవరకు అడ్డుపడకుండా రూపొందించడం జరుగుతుంది.

3. ఈ మనస్తత్వం, కళలపై, సాహిత్యంపైకూడా తన ప్రభావం చూపుతుంది. కళల్లో సాహిత్యంలో నగ్నత్వం, దిగంబరత్వం, తుచ్ఛమయిన కోరికలు ప్రతిబింబించడం అధికతరమవుతూ పోతుంది.

4. ఇకపోతే ఆర్థికరంగం. ఈ దృక్పథంవల్ల సమాజ జీవితంలో ఆర్థికపరంగా ఒకప్పుడు జాగీర్దారీ విధానం (ఫ్యూడలిజం) అగ్రతాంబూలం వహిస్తే మరొకప్పుడు పెట్టుబడిదారీ విధానం (కాపిటలిజం) ఉన్నతాసనాన్ని హస్తగతం చేసుకుంటుంది. ఇంకొకసారి కార్మికులు గందరగోళం సృష్టించి తమ ఏకాధిపత్యాన్ని స్థాపించుకుంటారు. న్యాయం అన్నది ఎన్నటికీ ఆర్థికరంగానికి ప్రాప్తమయ్యే యోగం మాత్రం లభించదు. ఎందుకంటే ప్రపంచం మరియు దాని సంపత్తి గురించి సమాజంలోని ప్రతి వ్యక్తి అవలంబించే వైఖరికి ప్రాతిపదిక అతని భావనలే. ఈ పద్ధతి ద్వారా రూపొందే ఆ భావన, "ఈ ప్రపంచం పరచిన ఓ విస్తరి. దీన్ని ఇష్టం వచ్చినట్లు, అవకాశం లభించినట్లు దోచుకోడానికి తనకు కావలసినంత స్వేచ్ఛ ఉంది" అన్నదేగనక, సమాజంలో ఏ వర్గానికి బలాధిక్యత ప్రాప్తమయితే ఆ వర్గం ఆర్థిక రంగంలో తన ఇష్టారాజ్యాన్ని సాగనిస్తుంది.

5. ఈ సమాజంలో వ్యక్తుల శీలనిర్మాణానికిగాను యేర్పాటయ్యే విద్యావ్యవస్థకూడా ఈ జీవన దృక్పథం ఈ వైఖరి కనుగుణంగానే ఉంటుంది. దీని ప్రకారం, ఆవిర్భవించే ప్రతి నవతరానికి ప్రపంచం, మనిషి, ప్రపంచంలో మనిషి స్థానం ఇత్యాది విషయాలను గురించి మనం పైన పరిశీలించిన భావనలే బోధించబడతాయి. ఏ శాస్త్రానికి సంబంధించిన విద్యాబోధన అయినా, దాని ద్వారా విద్యార్థికి ఈ జీవన దృక్పథం దానంతట అదే ప్రబుద్ధం అయ్యేలా

ఒక ప్రత్యేక ఫక్కీలో, విశేష పంథాలో నేర్పబడుతుంది. విద్యార్థుల శిక్షణకూడా ఈ ప్రత్యేక పద్ధతిలోనే జరపబడుతుంది. తద్వారా అతడు తన జీవితంలో ఈ దృక్పథం సూచించే వైఖరినే అవలంబించేందుకు, ఈ దృక్పథం ప్రకారం నిర్మించబడే సమాజంలో అతికిపోయేందుకు సకల విధాలా తయారవుతాడు.

ఈ విద్యా శిక్షణలను గురించి మన తరంవారికి ఎక్కువగా చెప్పనవసరం లేదు, ఎందువల్లనంటే ఈ తరం వారికి స్వయంగానే ఈ విద్యావిధానం అనుభవంలోకి వచ్చింది. వీరు ఏ విద్యాలయాల్లోనయితే విద్య నభ్యసిస్తున్నారో అవన్నీ ఈ దృక్పథం ప్రకారం స్థాపించబడ్డవే.

## మూఢ వైఖరి

మనం పరిశీలించిన ఈ వైఖరి సంపూర్ణంగా అజ్ఞానపు వైఖరి. దీని స్వరూప స్వభావాలు, అమాయకుడయిన ఒక పిల్లవానివైఖరిలాంటివి. అతడు కేవలం తన జ్ఞానేంద్రియాలను నమ్మి అగ్నికణాన్ని అందమైన ఆటవస్తువుగా నమ్మినటువంటి వైఖరే ఈ వైఖరికూడా. తేడా ఏమంటే పిల్లవాని విషయంలో, అతని జ్ఞానేంద్రియాల సలహా యెంత దోషభూయిష్టమయినదో వెంటనే అనుభవపూర్వకంగా తెలిసివస్తుంది. ఎందుచేతనంటే, ఏ కణాన్ని అతడు ఆటవస్తువుగా భ్రమపడి చెయ్యిచాచి సొంతం చేసుకోబోతాడో అది మండు తుండటం మూలాన ముట్టుకోగానే "నేను ఆట వస్తువును కాను" అని చెప్పి వేస్తుంది.

దీనికి భిన్నంగా ఈ జీవన దృక్పథం విషయంలో జ్ఞానేంద్రియాలు చేసిన పొరపాటు సుదీర్ఘకాలానికి గాని బహిర్గతం కాదు. ఇంకా కొందరికైతే అదసలు బహిర్గతమే కాదు. ఎందుకంటే మీరు ఏ అగ్నికణాన్నయితే ముట్టుకుంటారో దాని వేడి బహుస్వల్పం. వెంటనే చురక పెట్టదు, శతాబ్దాల తరబడి మెలమెల్లగా మాడ్చుతుంటుంది.

## నేత్రముంటే నిత్యదర్శనం

అయినా, ఎవరైనా అనుభవాల ద్వారా గుణపాఠం పొందగోరితే జీవితంలో అనుదినం ఈ దృక్పథం మూలంగా ఎదురయ్యే చేదు అనుభవాలే చాలు. ఈ దృక్పథం గల వ్యక్తుల నమ్మకద్రోహం, అధికారుల అత్యాచారాలు, న్యాయాధికారుల అన్యాయాలు, సిరిగలవారి స్వార్థాలు, సామాన్య ప్రజల దుర్గుణాలు ఇత్యాది అనుభవాలు, ఇది ఎలాంటి వైఖరో ఎత్తి చూపడానికి సరిపోతాయి.

ఇంకా కాస్త పెద్ద పరిమాణంలో, ఈ దృక్పథం మూలానే జాత్యహంకారం, సామ్రాజ్యవాదం, యుద్ధం, కల్లోలాలు, రాజ్యవిస్తీరణా కాంక్ష, జాతుల సంహారం లాంటి జ్వాలలు చెలరేగుతాయి. ఇవి ప్రసాదించే వాతల ద్వారా ఎవరైనా ఈ వైఖరిని గురించి ఇట్టే ఓ అభిప్రాయానికి రాగలరు. వ్యక్తిగత సామాజిక, జాతీయ అంతర్జాతీయ రంగాల్లోని ఈ అనుభవాల ద్వారా, మనిషి ఇది కేవలం "మూఢ వైఖరి"అని, "జ్ఞానప్రధానమైన వైఖరి" లేదా "శాస్త్రీయ వైఖరి" కాదనే నిర్ణయానికి రాగలడు. ఎందువల్లనంటే మనిషి తనను గురించి, ఈ విశ్వవ్యవస్థను గురించి యే అభిప్రాయం ఏర్పరచుకుని ఈ వైఖరిని అవలంబించాడో అది యదార్థానికి అనుగుణంగా లేదు, లేకపోతే ఇలాంటి దుష్ఫలితాలు బయల్పడి ఉండేవి కావు.

## ఇంద్రియ జ్ఞానం - ఊహాగానం

ఇప్పుడు మనం రెండో ఆలోచనా సరళిని పరిశీలిద్దాం. జీవితపు మౌలిక సమస్యల్ని పరిష్కరించడానికి చెలామణిలో ఉన్న రెండో విధానం ఏమిటంటే, జ్ఞానేంద్రియ జ్ఞానంతో ఊహాకల్పనా శక్తిని మేళవించి ఈ సమస్యలను గురించి ఓ అభిప్రాయానికి రావడం. ఈ విధానంలో మళ్ళీ మూడు విభిన్న అభిప్రాయాలు ఏర్పడ్డాయి. వీటిలో ప్రతిదీ ఓ ప్రత్యేక వైఖరిని సృజించింది.

# బుద్ధిపడే తికమక

## బహుదైవారాధన

ఈ రెండో విధానం వెల్లడించే మొదటి అభిప్రాయం యేమిటంటే, ఈ విశ్వవ్యవస్థ దైవం లేకుండా లేదు. అయితే దీనికి ప్రభువు ఎవరో ఒక్కరే కాదు, చాలా దైవాలున్నాయి. విశ్వవ్యవస్థలోని విభిన్న శక్తుల కేంద్రాలు మూలాధారాలు విభిన్న దైవాల హస్తగతమై ఉన్నాయి. మనిషి సౌభాగ్యమైనా, దౌర్భాగ్యమైనా, సాఫల్యమైనా, వైఫల్యమైనా, లాభమైనా, నష్టమయినా యేదైనా అనేక శక్తుల ఆగ్రహానుగ్రహాలపై ఆధారభూతమయి ఉంది, ఈ అభిప్రాయానికి వచ్చినవారు అంతటితో ఆగక తమ "ఊహా"శక్తిని వినియోగించి దైవికశక్తులు ఎక్కడెక్కడ, ఎవరెవరి చేతుల్లో ఉన్నాయో నిర్ణయించడానికి కృషిచేశారు. ఇంకా, యే యే వస్తువులపై వారి దృష్టి నిలిచిందో వాటినే దైవాలుగా నమ్మారు. ఈ అభిప్రాయం వల్ల మనిషి అనుసరించే వైఖరి యొక్క ముఖ్య లక్షణాలు, ప్రత్యేకతలు యేమంటే:

## ఊహాభవనాలు

ప్రథమంగా ఈ వ్యక్తి జీవితం యావత్తు గుడ్డినమ్మకాల నిలయమై కూర్చుంటుంది. అతడు కేవలం తన ఊహలూ భ్రమల ఆధారంగా, ఎలాంటి హేతుబద్ధమయిన నిదర్శనం లేకుండానే అనేక వస్తువులను గురించి అనేక తప్పుడు భావాలకు గురవుతాడు. అనేక వస్తువులు అసాధారణమైన, ప్రకృతికి అతీతమైన రూపంలో అతని భవితవ్యంపై మంచి ప్రభావమో చెడు ప్రభావమో వెయ్యగలవని మూఢంగా నమ్ముతాడు. తత్ఫలితంగా అతడు తన జీవితాంతం మంచి ప్రభావాలు వేసే ఊహాజనితమైన ఆశలను పెంచుకుని, చెడు ప్రభావాలు

వేసే నిరాధారమయిన భయాందోళనలకు గురవుతాడు. తన్మూలంగా తన శక్తీ సామర్థ్యాలను నిష్ప్రయోజనకరమయిన విధంగా వ్యర్థపరుస్తాడు.

ఒక్కోసారి ఏదయినా సమాధిని నమ్ముకొని అది తన కార్యం నెరవేరుస్తుందని ఆశిస్తాడు. మరొకప్పుడు యేదయినా విగ్రహాన్ని విశ్వసించి, అది తనకు సౌభాగ్యాన్ని చేకూర్చుతుందని భరోసాలో పడిపోతాడు. ఎప్పుడైనా ఎవరో కాల్పనిక భాగ్యవిధాతను సంతోషపరచడానికి పరుగులు తీస్తాడు. మరెక్కడయినా ఏదో "దుశ్శకునం" చూచి నిరాశ చెందుతాడు, నిరుత్సాహ పడతాడు. ఇంకోసారి మంచి శకునాల ఆశలపై గాలి మేడలు కట్టుకుంటాడు. ఈ భావాలు, ఊహలు, భ్రమలు, నమ్మకాలు, ఆశలు, నిరాశలు, అతన్ని, అతని ఆలోచనల్ని, అతని ప్రయత్నాల్ని సహజమైన మార్గాన్నుండి తప్పించి పూర్తిగా అసహజమైన, ఆచరణాత్మకంకాని మార్గాన పడవేస్తాయి.

రెండోది ఏమంటే, ఈ అభిప్రాయాల మూలాన పూజాపురస్కారాలు, మ్రొక్కుబడులు, ఇంకా ఇతర ఆచార వ్యవహారాల సుదీర్ఘమైన 'నియమావళి' తయారవుతుంది. అందులో పడిన మనిషి శక్తిసామర్థ్యాలు, కృషి, ప్రయత్నాల అత్యధిక భాగం నిష్ఫలమైన కార్యకలాపాలకు అంకితమై పోతుంది.

## వంచనకు నిచ్చెన

మూడో విషయం, ఎవరైతే ఈ బహుదైవభావనా ప్రధానమయిన మూఢనమ్మకాలకు గురవుతారో వారిని మోసపుచ్చి కళ్ళు గప్పడం సునాయాసంగా సాధ్యమవుతుంది. కుయుక్తులుగల నేర్పరులు వీరిని ఇట్టే తమ ఉచ్చులో పడేసుకుని తమ సంజ్ఞలపై ఆడించగలుగుతారు. ఒకడు "రాజు" అయి తన వంశానికి "సూర్య-చంద్రు"లతో ఇతర "దేవత"లతో సంబంధం కల్పించుకుని "మేము దైవాంశ సంభూతులం, మాకు దేవతలతో సంబంధం ఉంది, మీరంతా మా దాసులు" అని ప్రజల్ని నమ్మింప జూస్తాడు.

మరొకడు పురోహితుడు, పూజారి వేషం వేసుకుని, "మీ లాభనష్టాలు ఏ దేవతల హస్తగతమై ఉన్నాయో వారితో మాకు ప్రత్యక్ష సంబంధాలున్నాయి. మీరు మా తోడ్పాటు లేనిదే వారిని చేరలేరు"అని దబాయిస్తాడు. ఇంకొకడు విద్వాంసుడు పండితుడు, గురువై నిల్చుంటాడు. మంత్ర తంత్రాలూ, చేతబడుల తతంగం, నిర్వహిస్తాడు. "మేము వేసే యంత్రాలూ, మంత్రాలు, ప్రకృతికి అతీతంగా పనిచేస్తాయి. మీ అవసరాలు తీరుస్తాయి"అని ఈ మూఢప్రజల్ని నమ్మిస్తాడు.

ఈ విధంగా చాతుర్యంగల వంచకుల కుటుంబాలు శాశ్వతంగా వంశపారంపర్యంగా కొన్ని వర్గాలుగా రూపుదాల్చుతాయి. ఈ వర్గాల హక్కులు, అధికారాలు, ప్రత్యేకతలు, పలుకుబడి కాలక్రమేణ వృద్ధిచెందుతాయి. పటిష్టమయిన ప్రాతిపదికలపై నెలకొంటాయి. పర్యవసానంగా ఈ నమ్మకం మూలంగా మానవాళి భుజస్కంధాలపై రాజవంశాల, మత నాయకుల, ఆధ్యాత్మిక గురువుల, 'దైవత్వం'అనే కాడి వచ్చి పడుతుంది. ఈ కాల్పనిక చిల్లరదేవుళ్ళు సామాన్య ప్రజల్ని తమ బానిసలుగా సేవకులుగా చేసి వేస్తారు. వారిపట్ల తమకు పాలిచ్చే, స్వారీకై పనికివచ్చే, సరకులు మోసే పశువుల్లా ప్రవర్తిస్తారు.

నాలుగో అంశం ఏమిటంటే, ఈ దృక్పథం మూలంగా శాస్త్రాలు, కళలు, తత్వశాస్త్రం, సాహిత్యం, నాగరికత, సంస్కృతి, రాజకీయాలు ఇత్యాది ఏ విషయానికికూడా ఒక శాశ్వత ప్రాతిపదిక అన్నది ప్రాప్తం కాదు. ఇంకా ఈ కాల్పనిక దేవుళ్ళ ద్వారా మానవులకు ఎలాంటి మార్గదర్శకత్వం కూడా లభించదు, వాళ్ళు దాన్ని తమ నిత్య జీవితంలో పాటించటానికి, ఈ దేవుళ్ళతో మానవుల సంబంధం చాలా పరిమితమయింది. వారు ఈ దేవుళ్ళ కృపాకటాక్షాల ప్రాప్తికై కొన్ని ఆరాధనా ప్రధానమైన లాంఛనాలు ఆచరిస్తే చాలు. అంతమాత్రానికే దేవుళ్ళ దయాదాక్షిణ్యాలు మానవులకు ప్రాప్తమవుతాయి. పోతే, మిగతా

జీవితానికి సంబంధించిన సకల వ్యవహారాలకు చట్టాలు, నియమాల్ని నిర్మించడం, ఆచరణా పద్ధతుల్ని నిర్ణయించడం స్వయంగా మనుషుల బాధ్యత.

ఈ విధంగా బహుదైవ భావనగల సమాజం, ఇంతకు ముందు "అచ్చమయిన అజ్ఞానం" సందర్భాన చర్చించిన మార్గాలన్నిటిపైనా నడుస్తుంది, గుణగణాలు, ఆచరణలు, నాగరికతా విధానం, ఆర్థికవ్యవస్థ, సాంస్కృతిక సారస్వత పద్ధతులు అన్నీ ఆ ఫక్కీలోనే నడుస్తాయి. ఈ రూపాలన్నింటిలో బహుదైవ భావంగల వైఖరిలోనూ అచ్చమైన అజ్ఞానాన్ని ఆశ్రయించిన వారి వైఖరిలోనూ సూత్రప్రాయంగా ఎలాంటి వ్యత్యాసమంటూ ఉండదు.

## వైరాగ్యం

ఇంద్రియ జ్ఞానంతోపాటు భ్రమభ్రాంతుల్నీ ఊహల్ని కలిపి సాధించిన రెండో అభిప్రాయం ఇది: ఈ లోకం, ఈ శరీరం మానవునికి ఓ శిక్షలాంటిది. మానవ ఆత్మ శిక్షను పొందిన ఖైదీలా ఈ శరీరపు బందీఖానాలో నిర్బంధించబడింది. శరీరంతో ఆత్మకు గల ఈ సంబంధం మూలంగా మానవులకు కలిగే ఆవశ్యకతలు, రుచులు, వాంఛలు, కోరికలు అన్నీ వాస్తవానికి ఈ "బందీఖానా"లో మనిషికిపడ్డ బేడీలు, సంకెళ్ళు మాత్రమే. మనిషి ఎంతగా ఈ ప్రపంచంతో ఈ ప్రపంచపు వస్తువులతో సంబంధాన్ని పెంచుకుపోతాడో అతడు అంతే ఈ సంకెళ్ళలో ఇరుక్కుపోతాడు. ఇంకా అత్యధిక శిక్షకు అర్హుడవుతూ పోతాడు. ఈ భవబంధాల నుండి విముక్తి ప్రాప్తం కావాలంటే, జీవితపు చిక్కులన్నింటితో తెగతెంపులు చేసుకోవాలి; కోరికల్ని చంపుకోవాలి; రుచులకు దూరమవ్వాలి; శరీర అవసరాలను, మనసు కోరే కాంక్షలను నెరవేర్చకుండా నిరాకరించాలి, రక్తమాంసాల కారణంగా ఉత్పన్నమయ్యే ప్రేమానురాగాలన్నింటినీ అంతర్యంలో నుండి తొలగించాలి; ఇంకా తన శత్రువులైన మనో శరీరాలను సాధనలద్వారా, కృషి ద్వారా ఆత్మపై వాటి స్వాధీనం తప్పేవిధంగా

అమితంగా బాధ పెట్టాలి. ఇలా చెయ్యడం తప్ప గత్యంతరం లేదు. అప్పుడే అత్మ తేలికపడుతుంది, పరిశుద్ధమూ అవుతుంది. మోక్షపు ఔన్నత్యాలకు ఎగిరే శక్తి సామర్థ్యాలను పొందగలుగుతుంది.

## ప్రకృతితో పోరాటం

ఈ అభిప్రాయం వల్ల మానవుడు అవలంబించే వైఖరి యొక్క స్వరూప స్వభావాలు ఇలా ఉంటాయి:

ఒకటి: దీని ద్వారా మనిషిలోని ప్రవృత్తులన్నీ సామూహిక జీవితాన్నుండి వైయక్తిక జీవితంవైపునకు, నాగరికతనుండి మూఢత్వం వైపునకు మరలుతాయి. అతడు ప్రపంచానికి, ప్రాపంచిక జీవితానికి వైముఖ్యం చూపుతాడు; బాధ్యతలనుండి పలాయనమవుతాడు; అతని జీవితమంతా సహకారనిరాకరణ సదృశమై పోతుంది. అతని స్వభావాలు ప్రవర్తనలన్నీ విలోమ (Nagative) రూపం ధరిస్తాయి.

రెండు: ఈ అభిప్రాయానికి పర్యవసానంగా సజ్జనులు, మంచి మనుషులు ప్రపంచ కార్యకలాపాలకు దూరమై తమ ముక్తి కోసమని ఏకాంత కుహరాల్లోకి వెళ్ళిపోయి ప్రపంచ వ్యవహారాలన్నింటినీ దుష్టులయిన వారి కైవసం చేసివేస్తారు.

మూడు: నాగరిక జనావళిలో ఈ అభిప్రాయం ఏ మేరకు వ్యాపిస్తే అంతవరకు ప్రజల్లో విలోమ నైతికత, సంఘవ్యతిరేక (Anti Social), వ్యక్తితత్వ (Individualistic) ప్రవృత్తులు, నిరాశావాదపు ఆలోచనలు ఉత్పన్నమవుతాయి. వీరి క్రియాశీలత చల్లబడుతుంది. వీరు దౌర్జన్యపరులపట్ల మెతక సరుకుగా తయారవుతారు. క్రూరమైన యే ప్రభుత్వమైనా వీరిని అవలీలగా తన అధీనంలోకి తీసుకోగలదు. వాస్తవానికి ఈ దృక్పథం ప్రజాసామాన్యాన్ని కొందరు అత్యాచారుల కొరకు పెంపుడుజీవాలుగా మార్చడానికి మంత్ర శక్తిలా ఉపకరిస్తుంది.

నాలుగు: మానవనైజంతో ఈ దృక్పథానికి నిరంతర ఘర్షణ జరుగుతూనే ఉంటుంది. ఇది తరచుగా మానవ ప్రకృతి చేతుల్లో ఓడిపోవడం కూడా కద్దు. అయితే ఈ దృక్పథం పరాజయం పొందినప్పుడల్లా, తన బలహీనతను దాచుకోడానికి కుంటి సాకుల చాటున శరణు జొచ్చవలసి వస్తుంది. అందువల్లనే ఒకచోట "పాపాల పరిహారంగా రక్తం చిందించిన" సిద్ధాంతం, మరొకచోట "ఐహిక ప్రేమ" ద్వారా దైవిక ప్రేమను సాధించడం అనే సిద్ధాంతం చోటు చేసుకున్నాయి. ఇంకోచోట "ప్రపంచ వైరాగ్యం" తెరల వెనక 'ప్రపంచ పూజ' 'చెయ్యబడుతుంది. దాన్ని చూస్తే ప్రాపంచికులు కూడా సిగ్గుతో నీరుకారిపోతారు.

## అద్వైతం

ఇంద్రియ జ్ఞానంతోపాటు ఊహల్ని మేళవించగా పుట్టే మూడో అభిప్రాయమేమంటే, మానవుడు, విశ్వానికి సంబంధించిన యావత్తు వస్తువులు స్వతహాగా అవాస్తవాలు. వీటికి యదార్థమైన ఉనికి అంటూ లేదు. వాస్తవమేమంటే, ఒక శక్తి ఈ పదార్థాలన్నింటినీ తన రూపప్రదర్శనకు సాధనాలుగా సృష్టించింది. ఆ శక్తే, వీటన్నింటిలో ప్రత్యక్షమవుతోంది. వివరాల్లోకి వెళ్ళినట్లయితే ఈ దృక్పథానికి బహు రూపాలు ఉన్నాయి. కాని ఈ వివరాలన్నింటిలో సామాన్యమయిన విషయం, దృక్పథం ఒక్కటే. ఉనికిగల పదార్థాలన్నీ ఒకే "అస్తిత్వం" యొక్క బాహ్యరూపాలు మాత్రమే. వాస్తవంగా ఉన్నది ఆ శక్తి ఒక్కటే. మిగతా అంతా హుళక్కి, మాయ!

## జగన్నాటక సూత్రధారి

ఈ దృక్పథం రీత్యా మనిషి అవలంబించే వైఖరి ప్రకారం మనిషికి తన ఉనికే అనుమానాస్పదమయిపోతుంది. ఇక అతడు ఏదయినా పని చేయడమన్నది ఎలా సాధ్యం? అతడు తనను తాను ఓ తోలు బొమ్మగా భావిస్తాడు. దాని సూత్రధారి ఒకడున్నాడు. ఆయనే దాన్ని ఆడిస్తున్నాడని తలుస్తాడు. లేదా

అందులో (బొమ్మలో) మరెవరో ఉండి ఆడుతున్నాడని తలపోస్తాడు. ఇలాంటివ్యక్తి తన ఆలోచనల్లో తానే విలీనమయి పోతాడు. ఇతనికి జీవిత ధ్యేయమంటూ ఒకటి ఉండదు. జీవనమార్గమంటూ కూడా ఏదీ ఉండదు. ఎందుకంటే అతని ఊహ ప్రకారం, నేను స్వయంగా ఏమీ కాను, నేను చెయ్యవల్సింది ఏదీ లేదు, నేను చెయ్యగలిగింది కూడా ఏమీ లేదు, వాస్తవానికి, నాలోనూ, ఈ విశ్వం యావత్తులోనూ విలీనమై ఉన్న సర్వాంతర్యామి, ఆది మధ్యాంతరహితుడే అంతా చేస్తున్నాడు, ఆయన పరిపూర్ణుడు గనుక నేనూ పరిపూర్ణుడనే. అయితే మరి కృషి, పరిశ్రమ దేనికి? ఆయన ఒకవేళ పరిణతి కొరకు కృషి చేస్తుంటే ఏ విశ్వ జనీన కదలికతో ఆయన పరిపూర్ణతవైపునకు పయనిస్తున్నాడో దాని ఉరవడిలో నేను ఒక అంశంగా నా అంతట నేను వెళ్ళిపోతాను. నేనొక అంశాన్ని మాత్రమే. ఆయన రేపు ఎలా వెళ్తున్నాడో ఎటు వెళ్తున్నాడో ఎటు వెళ్ళాలనుకున్నాడో నాకెలా తెలుస్తుంది?

ఈ ఆలోచనా సరళి యొక్క ఆచరణాత్మకమయిన పరిణామాలుకూడా, వైరాగ్యపు దృక్పథానికి సంబంధించినటువంటివే, ఇంకా కొన్ని పరిస్థితుల్లో ఈ దృక్పథాన్ని అవలంబించేవాని వైఖరి, అచ్చమయిన అజ్ఞానాన్ని అవలంబించే వాని వైఖరిని పోలి ఉంటుంది. ఎందుకంటే ఈ వ్యక్తి కూడా తన మనోకాంక్షలకే తన జీవితపు కళ్ళేన్ని హస్తగతం చేస్తాడు. కోరికలు ఎటు తీసుకువెళ్తే అటు జంకుగొంకు లేకుండా పయనిస్తాడు. ఈవిధంగా "తనను నడిపించేది వాస్తవానికి ఆ పరమ అస్తిత్వమే కాని తాను కాదు" అని అభిప్రాయపడుతూ ఉంటాడు.

## చివరికి

తొలి దృక్పథం (అచ్చమయిన అజ్ఞానం) మాదిరిగా ఈ మూడు దృక్పథాలు కూడా అజ్ఞానపు దృక్పథాలే. అందువల్ల ఈ దృక్పథాల ద్వారా ఉత్పన్నమయిన వైఖరులు కూడా అజ్ఞానపు వైఖరులే. ఎందుకంటే వీటిలో ఏ

దృక్పథానికైనా ఎలాంటి శాస్త్రీయ నిదర్శనమూ మూలాధారం కాదు. ఇవన్నీ కేవలం కాల్పనికం, ఊహా జనితం. ఊహల ప్రాతిపదికలపైనే విభిన్న అభిప్రాయాలు ఏర్పరచుకోబడ్డాయి. మరో విషయమేమంటే, ఇవి యదార్థవిషయానికి విరుద్ధమయినవని అనుభవపూర్వకంగా రుజువవుతోంది. ఎందుకంటే వీటిలో ఏ ఒక్క అభిప్రాయమయినా యదార్థానికి అనుకూలమయినదయి ఉంటే దాన్ని అవలంబించడం మూలాన దుష్టపరిణామాలు అనుభవంలోకి వచ్చేవి కావు.

ఒక పదార్థాన్ని మనిషి తిన్నప్పుడల్లా అతని కడుపులో తప్పక నొప్పి పుట్టిందని మీరు గమనించినట్లయితే ఆ పదార్థం వాస్తవానికి జీర్ణకోశం, దాని నిర్మాణం మరియు దాని స్వభావానికి అనుకూలత లేనిదని మీరు నిర్ణయానికి వస్తారు, అచ్చం ఇదే రీతిలో, బహుదైవభావన, వైరాగ్యం, అద్వైత దృక్పథాలను అవలంబించడం మూలాన మానవుడు మొత్తానికి నష్టపోవడమే జరిగింది. ఇదే నిజమయితే, వీటిలో ఏ దృక్పథం కూడా యదార్థానికి అనుకూలమయింది కాదనడానికి ఇది స్పష్టమయిన నిదర్శనం.



# ఇస్లామ్ చూపుతుంది మార్గం

జీవితానికి సంబంధించిన ఆ మౌలిక సమస్యల పరిష్కారానికి మిగిలిన మూడో మార్గాన్ని పరిశీలించడమే మనకు మిగిలిన దారి. తమకు వాస్తవికతను గురించి ప్రత్యక్షజ్ఞానం ఉన్నదని ప్రకటించే "దైవప్రవక్తలు" అందజేసిన పరిష్కారమార్గాన్ని స్వీకరించడం ఒక్కటే మిగిలింది.

## జ్ఞానంకల వ్యక్తి

ఈ మార్గాన్ని ఒక ఉపమానం ద్వారా అర్థం చేసుకోవడం సులువు. మీరు ఒక కొత్త ప్రదేశంలో ఉన్నారు. మీకు ఆ ప్రాంతం గురించి ఏమీ తెలీనప్పుడు మీరు మరో వ్యక్తిని అడిగి తెలుసుకోవడానికి ప్రయత్నిస్తారు. అతని మార్గదర్శకత్వంలోనే మీరు ఆ ప్రదేశంలో తిరుగుతారు, సైరు చేస్తారు. ఇలాంటి పరిస్థితిలో సామాన్యంగా మీరు మార్గదర్శకత్వానికై వెదికే మనిషి : (అ) తనకు ఆ ప్రదేశం గురించి తెలుసు అని స్వయంగా ప్రకటించేవాడయి ఉండాలి. (ఆ) సందర్భ ఔచిత్యాన్నిబట్టి, అతని పోకడల్ని బట్టి అతడు విశ్వసనీయుడని మీకు తృప్తి కలగాలి. (ఇ) ఆ తరువాత మీరు అతని మార్గదర్శకత్వం ప్రకారం నడుచుకుని చూస్తారు. అతడు తెలిపిన విషయాల ప్రకారం మీరు నడుచుకున్నప్పుడు మీకు ఎలాంటి హాని కలగలేదని ప్రయోగాత్మకంగా రుజువయితే అతడు వాస్తవంగా "తెలిసిన" వ్యక్తి అని, అతడు ఆ ప్రాంతం గురించి తెలిపిన విషయాలన్నీ సరైనవని మీకు గట్టి నమ్మకం కుదురుతుంది. ఇదొక శాస్త్రీయ విధానం, మరొక శాస్త్రీయ విధానం ద్వారా ఏ విషయం గురించి అయినా ఒక అభిప్రాయానికి రావడం సాధ్యపడకపోతే మిగిలిన ఈ విధానమే సరయిన విధానమవుతుంది.

ఇక గమనించండి. ఈ "ప్రపంచం" మీకు ఓ కొత్త ప్రదేశం. దాని వాస్తవికత ఏమిటో మీకు తెలీదు. దీని నిర్వహణ ఏ విధంగా జరుగుతుందో కూడా మీకు తెలియని విషయమే. ఈ కర్మాగారం ఏ సూత్రాల ప్రకారం నడుస్తుందో అన్న విషయమూ మీకు తెలియనిదే. ఈ కార్యరంగంలో మీ స్థితి ఏమిటో, ఇక్కడ మీరు ఏ వైఖరిని అవలంబించడం ఉచితమో అనేది కూడా మీకు ఏమాత్రం తెలీదు. మీరు తొలుత, ఇది ఏ బాహ్యరూపంలో అగుపడుతుందో, అసలు వాస్తవం కూడా అదే అని అభిప్రాయపడ్డారు. ఈ దృక్పథం ప్రకారం అమలు జరిపి చూశారు. ఫలితం వికృతంగా దర్శనమిచ్చింది. ఆ తరువాత మీరు ఊహలు, భ్రమల ఆధారంగా విభిన్న అభిప్రాయాలు ఏర్పరచి వాటిలో ప్రతి ఒక్కదాన్ని ప్రయోగించి చూశారు. ప్రతిసారీ పరిణామం చెడుగానే రూపొందింది. ఇక మిగిలింది చివరి మార్గం ఒక్కటే, దైవప్రవక్తల వైపునకు మరలడం.

## అనుభవం చాటే నిజం

తాము వాస్తవాన్ని ఎరిగిన వాళ్ళమని దైవప్రవక్తలు ప్రకటిస్తారు. వీరి చరిత్రను ఎంత క్షుణ్ణంగా పరిశీలిస్తే అంత రూఢిగా తెలిసే విషయమేమంటే, వీరు అత్యంత సత్యసంధులు, ఉత్తమ విశ్వసనీయులు, ఉన్నతస్థాయి సద్వర్తనులు, పరమ నిస్వార్థపరులు, నిర్మల మనోమస్తిష్కాలు కలవారు. కనుక స్థూలంగా చూస్తే వారిని విశ్వసించడానికి చాలినన్ని కారణాలున్నాయి. ఇక మిగిలిందేమంటే, ప్రపంచం గురించి, ప్రపంచంలో మీ స్థితిగతుల గురించి వారు తెలిపే విషయాలు ఎంతవరకు సమంజసమయినవి? ఈ విషయాలకు వ్యతిరేకంగా శాస్త్రీయ నిదర్శనం ఏదయినా ఉందా? వారు చెప్పే దృక్పథం ప్రకారం ప్రపంచంలో అవలంబించబడిన వైఖరి అనుభవపూర్వకంగా ఎలాంటి ఫలితాన్నిచ్చింది? అన్న ప్రశ్నలకు సమాధానాలు వెదకడం. పరిశోధన ద్వారా ఈ మూడు ప్రశ్నలకు సమాధానాలు కూడా సంతృప్తికరంగా లభించాయంటే వీరి

(దైవప్రవక్తల) మార్గదర్శకత్వాన్ని విశ్వసించాలి. ఇంకా, జీవితంలో వారు చూపిన దృక్పథానికి పొసగే వైఖరినే అవలంబించాలి.

ఇంతకు ముందే మనం గమనించినట్లు, వెనుక చర్చించిన అజ్ఞానపు విధానాలతో పోల్చిచూస్తే ఈ మార్గం శాస్త్రీయమయింది. మనిషి, ప్రవక్తలు ప్రకటించే ఈ "జ్ఞానాన్ని" స్వీకరిస్తే తన అహంభావాన్ని సొంత అభిప్రాయాల్ని వదిలేసి ఈ "జ్ఞానాన్ని" అనుసరిస్తే, ఈ "జ్ఞానం" ఏర్పరచిన హద్దుల లోపలే తన వైఖరిని మలచుకుంటే, దాన్నే "ఇస్లామీయ విధానం" అని అంటారు.

## ప్రవక్తల దృక్పథం

## విశ్వవ్యవస్థ

ప్రవక్తలు చెప్పేదేమంటే, మనిషి, మనిషిచుట్టూ ఉన్న ఈ ప్రపంచం, ఈ సృష్టి రాజ్యమంతా ఏదో కాకతాళీయంగా ఉనికిలోకి వచ్చిన సరంజామా కాదు. ఇదంతా సువ్యవస్థతో కూడుకున్న పటిష్ఠమయిన ఓ సామ్రాజ్యం. దేవుడు దీన్ని సృష్టించాడు. ఆయనే దీని యజమాని. ఆయన ఒక్కడే దీని ప్రభువు, ఏలిక కూడా. ఇదొక "ఏకసత్తాక వ్యవస్థ" (Totalitarian System). ఇందులో అధికారాలన్నీ కేంద్ర ఆధిపత్యానికి హస్తగతమయి ఉన్నాయి. ఈ సర్వాధికారి శాసనం తప్ప మరెవ్వరి ఆజ్ఞా ఇక్కడ చెల్లనేరదు. విశ్వవ్యవస్థలో ఉన్న సకల శక్తులు ఆయన అదుపు, ఆజ్ఞల్లోనే ఉన్నాయి. ఆయన ఆజ్ఞను జవదాటే శక్తి ఎవ్వరికీ లేదు. ఆయన అనుజ్ఞలేనిదే, సొంత అధికారంతో కదిలే శక్తి కూడా మరెవ్వరికీ లేదు. ఈ సర్వవ్యాప్తమయిన వ్యవస్థలో ఒకరి సొంత అధికారానికి బాధ్యతా రాహిత్యానికి ఎలాంటి తావులేదు, సహజంగా ఉండజాలదు కూడా.

## మానవుడు

మనిషి ఇక్కడ జన్మతః పాలితుడు. పాలితుడవడం అతని ఇష్టంపై ఆధారపడిలేదు. అతను పాలితునిగానే పుట్టాడు. పాలితుడు తప్ప మరే

స్థానమయినా పొందడం అతనికి సాధ్యం కూడా కాదు. కనుక ఇతనికి, స్వయంగా తన జీవన విధానాన్ని రూపొందించుకోడానికి, తన బాధ్యతల్ని తానే నిర్ణయించుకోడానికి ఎలాంటి హక్కు లేదు. తన సొంతమయిన వస్తువుల్ని ఎలా వాడుకోవాలో ఆ నియమం నిర్మించుకోడానికి కూడా అతనికి హక్కు లేదు. వాస్తవానికి ఇతడు ఏ వస్తువుకూ స్వామి, యజమాని కాడు. అన్నీ ఇతనికి ఇతని నిజస్వామి ప్రసాదించినవే. చివరికి ఇతని దేహం, ఇతని సర్వ శక్తులు సయితం దైవానికి చెందినవే, ఆయన ప్రసాదించినవే. అందువల్ల ఇతనికి తన ఇష్టానుసారం వాటిని వినియోగించుకునేందుకు అధికారం, హక్కుల్లేవు. నిజానికి, ఎవరయితే ఈ వస్తువుల్ని ఇతనికి ప్రసాదించాడో ఆయన అభీష్టం ప్రకారమే వీటిని ఇతడు వాడుకోగలడు.

ఇలాగే మనిషి చుట్టు ప్రక్కలా ప్రపంచం నిండా కానవచ్చే వస్తువులు, ఈ భూమి, పశువులు, నీరు, వృక్షాలు, ఖనిజాలు - సర్వమూ అల్లాహ్‌కు చెందినవే. ఆయనే అన్నింటికీ స్వామి, మనిషి వీటిలో దేనికీ యజమాని కాడు. కనుక వీటిని కూడా తన ఇష్టానుసారం ఉపయోగించుకునే ఎలాంటి హక్కు మనిషికి లేదు. వీటిని కూడా అసలు నిజ యజమాని నిర్ణయించిన నియమం, విధానం ప్రకారమే ఇతడు వినియోగించుకోవాలి.

ఇలాగే ఏ విధంగానయితే ప్రతివ్యక్తి, వ్యక్తిగతంగా ఆ ప్రభువుకు పాలితుడో, ధరణిపై నివసించే మానవులంతా కలిసినప్పుడు కూడా ఆ అల్లాహ్ పాలితులే. వీరి జీవితాలు పరస్పరం ఒండొకరిపై ఆధారపడి ఉన్నాయి. అయితే వీరంతా దైవానికి పాలిత ప్రజలేగనుక, తమ పరస్పర సంబంధాలకై కూడా స్వయంగా ఏవయినా. సూత్రాలూ, నియమాలు నియమించుకునేందుకు వీరికి అధికారం లేదు. వీరి సంబంధాలన్నీ దైవం నిర్ణయించిన నియమాలు, చట్టాలపైనే ఆధారపడి ఉండవలసి ఉంటుంది.

## దైవ శాసనం

ఇకపోతే, దైవం నిర్ణయించిన ఆ నియమాలు, చట్టాలు, ఆ దైవశాసనం ఏదీ? అన్నదే ప్రశ్న. దీనికి దైవప్రవక్తలు చెప్పేదేమంటే, ఏ జ్ఞానానికి ఆధారపడి మేము ఈ ప్రపంచానికి మరియు స్వయంగా మీకు సంబంధించిన సత్యాన్ని తెలుపుతున్నామో అదే జ్ఞానం ద్వారా మానవాళికై దైవం నిర్ణయించిన చట్టం, దైవశాసనం కూడా మాకు తెలిసింది. ఈ జ్ఞానాన్ని మాకు ప్రసాదించింది స్వయంగా దైవమే. ఈ జ్ఞానాన్ని చేరవేయడానికే మేము దైవం తరపున నియుక్తులమయ్యాము. కనుక మీరు మమ్మల్ని నమ్మాలి. మీ ప్రభువు ప్రతినిధులుగా మమ్మల్ని అంగీకరించాలి. మా ద్వారా ఆ దైవం పంపిన ప్రామాణిక జ్ఞానాన్ని పొందండి. మేము దాన్ని మీకు అందజెయ్యగలము.

## పరీక్ష

ప్రవక్తలు ఇంకా ఇలా అంటారు: విశ్వ రాజ్యమంతా కట్టుదిట్టంగా, పటిష్టమయిన వ్యవస్థగా నడుస్తున్నా స్వయంగా పాలకుడూ కానరావటం లేదు. ఆయన పాలనా వ్యవహారాన్ని నడిపించే కార్యకర్తలూ కానరావటం లేదు. మనిషి కూడా ఓ విధమయిన స్వేచ్ఛాప్రతిపత్తుల్ని కలిగి వున్నాడు. ఏ విధంగా ఇష్టపడితే అలా చెయ్యగలుగుతాడు, స్వయంగా స్వామి అయి కూర్చున్నా, నిజస్వామిని కాదని ఇతరుల విధేయతను పాటించినా, ఇతరులకు తలవంచినా అతని జీవన భృతి అతనికి లభిస్తూనే ఉంటుంది. వనరులూ ప్రాప్తమవుతాయి, ఇంకా ఈ తిరుగుబాటు ధోరణికి శిక్షా లభించదు. ఇదంతా కేవలం మానవుల పరీక్ష కొరకే జరుగుతోంది. మనిషికి, బుద్ధి, వివేచనాశక్తి, విచక్షణా జ్ఞానం అన్నీ ఇవ్వబడ్డాయి. అలాంటప్పుడు మనిషిని పరీక్షించటం ఉద్దేశ్యం కాబట్టి నిజస్వామి, ఆయన పరిపాలనా వ్యవస్థ అంతా మనిషి కనుమరుగవడమే సమంజసం. అందుకే ఆయన, ఆయన పరిపాలనా వ్యవస్థ అంతా ఎక్కడా కానరాదు.

ఆయన మనిషిని పరీక్షించదలచాడు. మీరు మీ శక్తుల్ని ఎలా వినియోగిస్తారో చూడటానికి మీకు బుద్ధీ వివేకాలతోపాటు ఇష్టమయిన దాన్ని ఎన్నుకునే స్వేచ్ఛ (Freedom of Choice)ను, ఒక విధమయిన స్వతంత్రప్రతిపత్తి (Autonomy) ని ప్రసాదించి వదిలాడు. మీరు పాలితులుగా మీ స్థానాన్ని అర్థం చేసుకుని, ఎలాంటి ఒత్తిడి, బలాత్కారం లేకపోయినా, స్వచ్ఛందంగా, సంతోషంగా మీరు పాలితులన్న విషయాన్ని ఒప్పుకున్నట్లయితే, మీ నిజస్థానాన్ని స్వీకరించినట్లయితే, మీరు మీ స్వామి పెట్టిన పరీక్షలో నెగ్గుకువస్తారు. మీరు మీ స్థానాన్ని అర్థంచేసుకోకపోతే లేదా అర్థం చేసుకున్నా తిరుగుబాటు వైఖరిని అవలంబిస్తే ఈ పరీక్షలో తప్పిపోతారు. ఈ పరీక్ష కొరకే ఈ ప్రపంచంలో మీకు కొన్ని అధికారాలు ఇవ్వబడ్డాయి. ప్రపంచంలో ఎన్నో పదార్థాలు, వస్తువులు మీ అధీనంలో ఇవ్వబడ్డాయి. వీటితోబాటు మీ జీవితకాలమూ పరీక్షా వ్యవధిగా ప్రసాదించబడింది.

## ఇక్కడ దొరికేది ప్రతిఫలం కాదు

దైవప్రవక్త (సఅసం) ఇంకా తెలిపేదేమంటే, ఈ ప్రాపంచిక జీవితం కేవలం పరీక్షా వ్యవధి కాబట్టి ఇక్కడ సత్ఫలితమూ దొరకదు, శిక్షా లభించదు.★

---

★ ఈ సందర్భంలో ఓ విషయాన్ని బాగా గుర్తుంచుకోవాలి. ఇప్పుడు మనం జీవిస్తున్న ఈ లోకం వాస్తవానికి భౌతిక లోకం, ఇది నైతికలోకం కాదు. ప్రస్తుతం విశ్వవ్యవస్థ ఏ నియమాల ప్రకారం నడుస్తోందో అవి నైతిక నియమాలు కావు భౌతిక నియమాలు. అందువల్ల ప్రస్తుత విశ్వవ్యవస్థలో మనుషుల కర్మల నైతిక ఫలితాలు పూర్తిగా అభివ్యక్తం కావు. ఒకవేళ ఎక్కడైనా అవి వ్యక్తమైనా, కేవలం భౌతిక నియమాలు వాటికి వ్యక్తమయ్యేందుకు అవకాశం ఇచ్చినంతవరకే. అవి వ్యక్తమయ్యేందుకు భౌతిక నియమాలు అనుకూలించక పోయినచోటల్లా అవి వ్యక్తమవడం అసాధ్యం. ఉదాహరణకు ఒక వ్యక్తి ఎవరినైనా హత్య చేసినట్లయితే, దాని ఆచూకి లభించాలి. ఆ హంతకునిపై నేరం రుజువుకావాలి, అతనికి నైతిక శిక్ష విధించబడాలి - ఇదంతా జరగడానికి భౌతిక నియమాలు తోడ్పడాలి. అప్పుడే

ఇక్కడ మీకు ఏదయినా ప్రాప్తిస్తే అదంతా తప్పనిసరిగా మీరు చేసిన ఏదయినా సత్కార్యానికి ప్రతిఫలం కానవసరం లేదు. అల్లాహ్ మీ ఆచరణ పట్ల సంతోషంగా ఉన్నాడని, లేక మీరు చేసేదంతా సరయినదే అని ఇక్కడ ప్రాప్తించిన దాన్నిబట్టి భావించడానికి అసలే వీల్లేదు. వాస్తవానికి ఇదంతా పరీక్షా సామగ్రి. ఈ ధనధాన్యాలు, సంతానం, సేవకులు, అధికారం, జీవితావసరాలు అన్నీ మీ పరీక్ష కొరకు ఇవ్వబడ్డవే. మీరు వీటిని వినియోగించి మీ శక్తి సామర్థ్యాలు, మీ యోగ్యతాయోగ్యతలు కనబరచాలి. అందుకే వీటిని మీకు ప్రసాదించటం జరిగింది.

అలాగే ఇక్కడ సంభవించే కష్టాలు, నష్టాలు, బాధలు, ఆపదలు అన్నీ తప్పనిసరిగా మీ చెడు వర్తనానికి శిక్ష కావు. కొన్ని ప్రకృతి సిద్ధాంతాల కనుగుణంగా వాటంతట అవే ఏర్పడే పరిణామాలయితే★ మరికొన్ని మీ

---

ఈ చర్యయొక్క నైతిక ఫలితం వ్యక్తమవుతుంది. ఒకవేళ భౌతిక నియమాలు తోడ్పడకపోతే ఏ నైతిక ఫలితమూ వ్యక్తం కాదు. కాకపోతే ఒకవేళ భౌతిక నియమాలు అనుకూలించినా ఈ చర్య యొక్క నైతిక ఫలితాలన్నీ బయల్పడ జాలవు. ఎందుకంటే, హతునికి బదులుగా కేవలం హంతకుణ్ణి చంపడం ఆ వ్యక్తి చేసిన చేష్ట యొక్క పరిపూర్ణమైన నైతిక ఫలితం కాదు. అందువల్లనే ఈ ప్రపంచం ప్రతిఫల స్థలం కాదు, కాజాలదు కూడా. ప్రతిఫల స్థలమవడానికి ఓ వేరు వ్యవస్థ కావాలి. అందులో ప్రస్తుత విశ్వవ్యవస్థకు భిన్నంగా చెలామణిలో ఉండే నియమాలు నైతిక నియమాలై ఉండాలి. భౌతిక నియమాలు కేవలం వాటికి సేవక నియమాలుగా మాత్రమే ఉండాలి.

★ ఉదాహరణకు వ్యభిచారం చేసేవాడు సుఖరోగాలకు గురి అవడం అన్నది అతడు చేసిన పాపానికి నైతిక శిక్ష కాదు. అది కేవలం అతని చేష్టల భౌతిక ఫలమే. అతడు సక్రమమయిన చికిత్స చేయించుకోవడంలో నెగ్గినట్లయితే వ్యాధినుండి తప్పించుకుంటాడు. కాని తాను చేసిన చేష్టకు నైతిక శిక్ష నుండి మాత్రం తప్పించుకోలేడు. ఒకవేళ పశ్చాత్తాప్పడి క్షమాభిక్షను వేడుకుంటే నైతికశిక్షను తప్పుకోగలడు కాని వ్యాధి నివారణ కాదు.

పరీక్షకై ఉద్దేశించబడిన విపత్తులు.★ మరికొన్నయితే మీరు యదార్థ విషయానికి విరుద్ధంగా అవలంబించిన వైఖరి మూలంగా వెలువడిన బాధలు.★★ ఇంతకూ ఈ ప్రపంచం ప్రతిఫలం లభించే స్థానం కాదు. కేవలం పరీక్షా స్థలమే. ఇక్కడ సంభవించే పరిణామాలనుబట్టి మానవులు చేసే చర్యల్ని - సరయినవనీ, సరయినవి కావని లేదా మంచివనీ, చెడ్డవనీ లేదా స్వీకార యోగ్యమయినవనీ, స్వీకారయోగ్యం కానివనీ నిర్ణయించడానికి ప్రమాణాలుగా తీసుకోడానికి వీలులేదు. పరలోకంలో సంభవించే పరిణామాలే అసలు ప్రతిఫల ప్రమాణాలు.

## మరో జీవితం

ఇక్కడ జీవన వ్యవధి అంతమయిన తరువాత మరో జీవితం ఉంది. అందులో మీరు చేసిన కర్మల జాబితాను సాంతం పరిశీలించి మీరు పరీక్షలో నెగ్గారో, తప్పారో నిర్ణయించడం జరుగుతుంది. అక్కడ మీ సఫలతను లేదా నిష్ఫలతను నిర్ణయించే మౌలికమయిన అంశాలు ఏవంటే:

---

★ ఉదాహరణకు ఒక వ్యక్తి దారిద్ర్యానికి గురయ్యాడంటే, అది అతనిపట్ల పరీక్ష అన్నమాట. అతడు తన అవసరాల పరిపూర్తికొరకు అధర్మమైన మార్గాలు అవలంబిస్తాడా? లేక ధర్మమైన మార్గాలు అవలంబించడానికి స్థిరచిత్తంతో వ్యవహరిస్తాడా? కష్టాలు ఎదురయితే సత్యంపై, నిజాయితీపై నిలకడగా నిలుస్తాడా? లేక వ్యాకులపడి అసత్యం ముందు తల ఒగ్గుతాడా? అన్నదే ఆ పరీక్ష.

★★ అంటే మనిషి, ఈ ప్రపంచం దైవం లేకుండా నడుస్తుందని, తాను స్వేచ్ఛగలవాడని భావించి వ్యవహరించినప్పుడు యదార్థానికి వ్యతిరేకంగా వ్యవహరిస్తున్నాడు. ఎందుకంటే ఈ ప్రపంచం దైవం లేకుండానూ లేదు, మనిషి స్వేచ్ఛ గలవాడున్నూ కాదు. అందుచేత మనిషి తన ఈ వైఖరి వల్ల తప్పనిసరిగా దెబ్బతింటాడు. ఉదాహరణకు అగ్నికణాన్ని ఆటవస్తువుగా భావించి మీరు దాన్ని చేతులతో పట్టుకున్నారంటే మీ చేతులే కాలిపోతాయి. ఎందుకంటే మీరు యదార్థానికి విరుద్ధమైన వైఖరిని అవలంబించారు.

ఒకటి, మీరు మీ విచక్షణా జ్ఞానాన్ని బుద్ధికుశలతను సరిగా వినియోగించి, అల్లాహ్‌యే నిజప్రభువు, అధికారి అన్న విషయాన్ని, ఆయన పంపిన మార్గదర్శక బోధనలు దైవ మార్గదర్శకత్వమే అన్న విషయాన్ని గుర్తించారా? లేదా?

రెండు, యదార్థాన్ని తెలుసుకున్న తరువాత (ఎన్నుకునే స్వేచ్ఛ ఉన్నప్పటికీ) మీరు మీ ఇష్టంతో స్వచ్ఛందంగా అల్లాహ్ అధిపత్యాన్ని, ఆయన విధించిన శాసనాంగాన్ని మనస్ఫూర్తిగా స్వీకరించారా లేదా? ఈ మౌలిక విషయాల ప్రాతిపదికగా మీ కర్మల పరిశీలన జరిపి మీరు నెగ్గారో, తప్పారో నిర్ణయించడం జరుగుతుంది.

## ఇస్లామీయ సిద్ధాంతం - సమీక్ష

ప్రపంచం మరియు మనిషిని గురించి ప్రవక్తలు ప్రతిపాదించిన ఈ సిద్ధాంతం, ఒక పరిపూర్ణ సిద్ధాంతం. దాని విభిన్న అంశాల మధ్య హేతుబద్ధమయిన సంబంధం ఉంది. ఏ అంశమూ ఇతర అంశానికి విరుద్ధంగా లేదు. దాని ద్వారా ప్రపంచ సంఘటనలన్నింటికీ పరిపూర్ణ హేతువు, ప్రకృతి నిదర్శనాలన్నిటి సంపూర్ణ నిర్వచనం ప్రాప్తమవుతాయి. మన పరిశీలనలో, అనుభవంలో వచ్చే ఏ విషయమయినా ఈ సిద్ధాంతం పరిధిలోనిదే. ఈ విషయాలలో దేన్నయినాసరే ప్రవక్తలు చూపే సిద్ధాంతం ప్రకారం పరిశీలించి, దానికి హేతువును కనుగొనడం సాధ్యమే. అందువల్ల ఇదొక సశాస్త్రీయమయిన సిద్ధాంతం (Scientific Theory). "సశాస్త్రీయ సిద్ధాంతం" అన్న దానికి ఏ విధంగా నిర్వచించినా అది ప్రవక్తల సిద్ధాంతానికి వర్తిస్తుంది.

ఈ సిద్ధాంతాన్ని రద్దు చెయ్యగల ఏ పరిశీలన అయినా, మరే అనుభవమయినా ప్రపంచంలో మనకు తటస్థించలేదు. అందువల్ల ఈ సిద్ధాంతం తన స్థానాన స్థిరంగా ఉంది. దీన్ని రద్దయిన సిద్ధాంతాల్లో చేర్చడానికి వీల్లేదు.★

---

★ ఏ కాలంలోనయినా ఆనాటి శాస్త్రీయ దృక్పథాలు దీన్ని వ్యతిరేకించడం ఈ సిద్ధాంతం అంతమయిందనడానికి నిరూపణ కాదు. ఒక శాస్త్రీయ దృక్పథాన్ని కేవలం యదార్థాలు (Facts) మాత్రమే అంతమొందిస్తాయి కాని దృక్పథాలు

## హేతువు కాంతిలో

విశ్వవ్యవస్థను నిశితంగా పరిశీలిస్తే ఈ సిద్ధాంతం అత్యధిక సంభావ్యం (Most probable) అనిపిస్తుంది. విశ్వ వ్యవస్థలో ఉన్న ప్రబల క్రమబద్ధతను చూస్తే, దీనికి కార్య సంచాలకుడు ఒకడు లేడనడం కంటే సంచాలకుడు ఉన్నాడు అని చెప్పడమే విజ్ఞతతో కూడుకున్న విషయం. అలాగే దీని పటిష్ఠమయిన వ్యవస్థను చూచి, ఇదొక వికేంద్రీయమయిన, అనేక సంచాలకుల ఆధీనంలో నడుస్తున్న వ్యవస్థ అనడంకన్నా, దీన్ని, కేంద్రీయమయిన సర్వాధికారాలు గల ఒక్క సంచాలకుని క్రింద వ్యవహరిస్తున్న వ్యవస్థ అని తేల్చడమే ఎక్కువ సహేతుకమయిన విషయం. అలాగే ఈ వ్యవస్థలో ప్రస్ఫుటంగా కానవచ్చే పరిపాలనా పాటవాల దృష్ట్యా ఈ వ్యవస్థ అంతా లక్ష్యరహితమయిందని, కేవలం చిన్న పిల్లల ఆట అని అభిప్రాయపడటంకంటే, ఇదొక నిర్ణీత లక్ష్యం గల, అత్యంత వివేకవంతమైన వ్యవస్థ అని నిర్ణయించడమే సమంజసమైన విషయం.

ఇకపోతే, ఈ విశ్వవ్యవస్థను ఒక పరిపాలనా వ్యవస్థ అని ఒప్పుకుంటే, మనిషి ఈ వ్యవస్థలో ఒక·భాగం మాత్రమే అన్న యదార్థం దృష్ట్యా ఆలోచిస్తే, అత్యంత హేతుబద్ధమైన విషయమేమంటే, ఈ వ్యవస్థలో మనిషి సర్వస్వతంత్రుడుగా, బాధ్యతా రహితుడుగా మెలగడానికి ఆస్కారం ఉండరాదు. మనిషి నిజస్థానం పాలితునిదే. ఈ విధంగా ఇది ఒక అత్యంత సహేతుకమైన (Most Reasonable) సిద్ధాంతంగా మనకు పరిచయమవుతుంది.

శాస్త్రీయ దృష్టితో పరిశీలించినా ఇది సంపూర్ణంగా ఒక ఆచరణీయమైన (Practicable) సిద్ధాంతమని తెలుస్తోంది. ఈ సిద్ధాంతం ఆధారంగా జీవితం ఒక

---

కాదు. అందువల్ల, ప్రవక్తలు అందజేసిన ఈ విశ్వభావనను, ఈ మానవ భావనను ఏ నిరూపితమయిన యదార్థం తప్పుగా రుజువు చేసిందో తెలియనంత వరకు, ప్రవక్తల దృక్పథాన్ని అంతమయిన దృక్పథాల్లో చేర్చడం పూర్తిగా అశాస్త్రీయమయిన, దురభిమాన పూర్వకమయిన వాదన మాత్రమే.

సవివరమైన పథకంలా మనముందు ప్రత్యక్షమవుతుంది. తాత్వికత, నైతిక తల కొరకు, కళలు, శాస్త్రాలు, సాహిత్యం, పరిశ్రమల కొరకు, రాజకీయాలు, పరిపాలనా వ్యవస్థ కొరకు, యుద్ధం, సంధి, అంతర్జాతీయ సంబంధాల కొరకు - ఒక్కటేమిటి జీవితానికి సంబంధించిన ప్రతి అంశం, ప్రతి అవసరం కొరకు ఒక శాశ్వత ప్రాతిపదిక ప్రసాదిస్తుంది ఈ సిద్ధాంతం. జీవితపు ఏ రంగానికి సంబంధించిన వైఖరిని నిర్ణయించుకోడానికైనా మనిషి ఈ సిద్ధాంతం నిర్ణయించే పరిధిని దాటిపోయే అవశ్యకత ఏర్పడదు.

## జీవనపథం, వ్యక్తి

ఇక మిగిలిందొక్కటి. ఈ సిద్ధాంతంవల్ల ప్రాపంచిక జీవితంలో మనిషి అవలంబించిన వైఖరి ఎలా రూపుధరిస్తుంది? దాని పర్యవసానాలేమిటీ? అన్న విషయం.

వ్యక్తిగత జీవితంలో ఇతర అజ్ఞానపు సిద్ధాంతాలకు భిన్నంగా ఈ సిద్ధాంతం ఎంతో బాధ్యతాయుతమైన మరెంతో క్రమబద్ధమైన వైఖరిని సృజిస్తుంది. ఈ సిద్ధాంతాన్ని నమ్మే మనిషి తన శరీరాన్ని, దాని ఏ శక్తినయినా, ప్రపంచాన్నీ దానిలోని ఏ వస్తువునయినా తన సొంతం అని భావించి స్వతంత్రంగా వినియోగించుకోరాదు. ఇవన్నీ దేవునికి చెందినవే అని నమ్మి కేవలం ఆయన ఆజ్ఞాపాలనలోనే వీటిని వినియోగించుకోవాలి. తనకు లభించిన ప్రతిదాన్ని దేవుని అమానతుగా ఎంచాలి. తాను ఈ అప్పగింతలో ఒక్కొక్కదాని లెక్క దైవానికి చూపవలసి ఉందని భావించి మరీ దాన్ని వినియోగించాలి. ఈ లెక్క చూపడం కూడా మామూలు శక్తికి కాదు, ఆ శక్తి దృష్టినుండి తాను చేసే ఏ చర్యఅయినా, కడకు తన అంతర్యంలో అంకురించే ఏ ఆలోచన అయినా గుప్తంగా లేదు అని నమ్మాలి.

ఇలా నమ్మే వ్యక్తి అన్ని పరిస్థితుల్లోనూ ఒక క్రమశిక్షణకు బద్ధుడయి ఉంటాడన్నది సుస్పష్టం. అతడు కోరికల ఖైదీ అయి విశృంఖలంగా ఎన్నటికీ వ్యవహరించలేడు. అతను దౌర్జన్యపరుడు కాజాలడు, విశ్వాసఘాతకుడూ కాలేడు. అతని స్వభావాన్నీ, సౌశీల్యాన్నీ శంకించడానికి వీలుండదు. అతన్ని

పూర్తిగా నమ్మవచ్చు. అతడు ఏ నియమాన్ని పాటించాలన్నా బాహ్యబలాత్కారాలు, ఒత్తిడులు అవసరముండవు. అతని అంతర్యంలో ఒక బలవత్తరమైన నైతిక క్రమశిక్షణ పుట్టి పెంపొందుతూ ఉంటుంది. ఏ ప్రాపంచిక శక్తి అయినా తనను దండిస్తుంది అనే సంశయమూ లేనిచోట కూడా అతన్ని సక్రమమార్గంలో, సత్యసంధతలో స్థయిర్యంగా నిలబెట్టేది ఈ నైతిక క్రమశిక్షణే. దేవుడు నన్ను నిత్యం చూస్తున్నాడు, నా చేష్టల కారణంగా నన్ను దండిస్తాడు అనే దైవభీతి, ఈ జీవితం, ప్రపంచంలోని సమస్త వస్తు సామగ్రి నాకు దైవం తరపున అమానతుగా అప్పగించబడ్డవే అనే బాధ్యతా భావాలు ఎంతో మహోన్నతమైనవి. సమాజానికి విశ్వసనీయులైన వ్యక్తుల్ని అందివ్వగలగడానికి దీనికి మించిన మరో మార్గాన్ని మనం ఊహించనైనా లేము.

ఇంకా, ఈ సిద్ధాంతం కేవలం మనిషిని క్రియాశీలునిగా, నిరంతరం కృషి సలిపేవానిగా చేస్తుంది. అంతేకాక అతని కృషిని, స్వార్థం, కోరికల దాస్యం, జాత్యహంకారం లాంటి క్షుద్రమైన భావాలకు బదులు నిస్వార్థసేవ, సానుభూతి, సత్యంపట్ల ప్రేమ లాంటి ఉన్నత నైతిక ఆశయాల కొరకు జరిగేలా చేస్తుంది. "నేను ప్రపంచంలో వ్యర్థంగా రాలేదు; పనిచెయ్యడానికే దేవుడు నన్ను ఇక్కడికి పంపాడు; నా జీవితం, నా కోసమో నా బంధుమిత్రుల కోసమో కాదు. ఇది కేవలం దైవం నాకు అప్పగించిన పనిని పూర్తి చెయ్యడానికే. నన్ను స్వేచ్ఛగా, బాధ్యతారహితంగా వదలడమన్నది జరగదు. నేను నా సమయాన్ని, నా శక్తుల్ని, ఎంతవరకు, ఏ విధంగా ఖర్చు చేశానో ప్రశ్నించడం జరుగుతుంది" అని తనను గురించి తలపోసే వ్యక్తి కంటే అధికంగా పరిశ్రమించేవారు, ఫలవంతంగా, సక్రమంగా కృషి చేసేవారు మరొకరు కాజాలరు. అందువల్ల ఈ సిద్ధాంతం స్వీకరించి తయారయ్యే వ్యక్తుల కంటే ఉత్తమ వ్యక్తిగత వైఖరిగలవారిని ఊహించడం కూడా కష్టమే.

## సమాజం

ప్రథమంలో, ఈ సిద్ధాంతం మానవ సమాజానికి ఓ కొత్త ప్రాతిపదికనే ఇస్తుంది. ఈ సిద్ధాంతం ప్రకారం మానవులంతా దేవుని దాసులే, పాలితులే.

అందరూ పాలితులు అవడం మూలాన అందరి హక్కులూ సమానమే. అందరి స్థానమూ సమానమైనదే, అందరికి లభించే అవకాశాలూ సమానమైనవే. ఒక వ్యక్తి, ఒక వంశం, ఒక వర్గం, ఒక వర్ణం, ఒక జాతి - ఎవరికీ ఇతరులపై ఎలాంటి అధికృతలేదు లేక విశేషమైన హక్కులూ లేవు. ఈ విధంగా మనిషిపై మనిషి "ప్రభుత్వం" "అధికృత" భావాలు అమూలాగ్రంగా అంతమవుతాయి. రాచరికం, జమీందారీ, జాగీర్దారీ, వంశపారంపర్యాధికారం (Aristocracy), బ్రాహ్మణత్వం, పోపు పాలనాధికారం లాంటి వాటివల్ల జనించే కీడులన్నీ సమసిపోతాయి.

## సర్వసమానత

ఈ సిద్ధాంతం, ప్రపంచంలో అత్యధికంగా రక్తకాండకు కారణమైన సకల పక్షపాతాలను, దురభిమానాలను అంతం చేస్తుంది. తెగపరమైన, జాతిపరమైన, వంశం ప్రధానమైన, భౌగోళికమైన, వర్ణం ప్రాతిపదికగా గల అన్ని విచక్షణా భావాలను, దురభిమానాలను, పక్షపాతాలను నామరూపాల్లేకుండా నిర్మూలిస్తుంది. ఈ సిద్ధాంతం ప్రకారం యావత్తు జగత్తుకు స్వామి దైవమే. అన్నీ ఆయనకు చెందినవే. మానవులంతా "ఆదమ్" సంతానం మరియు దైవానికి దాసులే. అందువల్ల అందరూ సమానులే. తారతమ్యాలకు, విచక్షణలకు, ప్రత్యేకతలకు ఇక్కడ తావులేదు. మనుషులకు ఏదయినా ప్రాధాన్యత అంటూ ఉంటే, అది - వంశం, కులం, ధనం, వర్ణం వగైరాలపై ఆధారపడిలేదు. అది నైతికతలోని పారిశుధ్యం, దైవభీతిపై ఆధారపడి ఉంటుంది. ఎవరయితే అత్యధికంగా దైవానికి భయపడతారో సంస్కారవంతమైన, నిష్టాపరాయణమయిన భయభక్తుల జీవితం గడుపుతారో వారే సర్వశ్రేష్ఠులు.

అలాగే మనిషీ మనిషికి మధ్యన సామూహిక సంబంధబాంధవ్యాల, తారతమ్యాల, ప్రత్యేకతల ప్రాతిపదికల్ని సైతం ఈ సిద్ధాంతం మార్చివేసింది. మనిషి తన కాల్పనిక భావాల రీత్యా, మనుషుల కలయికకు, వేర్పాటుకు ఏ విషయాలనయితే పునాదులుగా నిర్మించుకున్నాడో, అవి మానవాళిని అసంఖ్యాక శాఖోపశాఖలుగా విభజిస్తాయి. మానవుల మధ్య అభేద్యమయిన గోడల్ని

సృష్టిస్తాయి. ఎందుకంటే, వంశం, దేశం, జాతి, వర్ణం అనే వాటిని మనిషి మార్చుకుని, ఒక వర్గం నుండి మరో వర్గంలోకి ప్రవేశించడానికి ఇవి అలా మారే విషయాలు కావు. దీనికి భిన్నంగా ఈ సిద్ధాంతం మనిషీ మనిషికి మధ్య కలయిక, వేర్పాటులకుగాను సూచించే ప్రాతిపదిక దైవ దాస్యం, దైవాజ్ఞాపాలన అన్నది. అంటే ఎవరయితే దైవం సృష్టించిననాటి (మానవులు అయినా మరే ఇతరములయినా) దాస్యాన్ని త్రోసిరాజని దైవదాస్యాన్ని స్వీకరిస్తారో, దైవశాసనాన్ని తమ జీవితానికి అనుసరణీయమయిన ఏకైక శాసనంగా అంగీకరిస్తారో వారందరూ ఒక వర్గం, ఇలా చెయ్యనివారు మరో వర్గం. ఈ విధంగా మానవుల మధ్య ఉన్న విభిన్న విభేదాలు సమసిపోయి ఒకే భేదం మిగిలిపోతుంది. ఈ విభేదాన్ని కూడా దాటెయ్యటం, మనుషులందరూ ఒకటవ్వడం సాధ్యమే. ఎందుకంటే, వంశం, వర్ణం, జాతి ఇత్యాది విభేదాలయితే మనిషి నుండి దూరమవజాలవు. మనిషి ఈ విభేదాల్లో ఒక విభేదాన్ని దాటి, ఓ వర్గంలో నుంచి మరో వర్గంలోకి ప్రవేశించలేడు. కాని, ఒక మనిషి తన నమ్మకాలు, తన జీవన దృక్పథం, జీవన మార్గం మార్చుకుని దైవప్రవక్తలు ప్రతిపాదించిన ఒక వర్గం నుండి మరో వర్గంలోకి ప్రవేశించడం ఎల్లప్పుడూ సాధ్యమే.

## సత్సమాజం

ఇన్ని సంస్కరణలు జరిగిన తరువాత ఈ సిద్ధాంతం ప్రాతిపదికగా రూపొందే సమాజం, దాని తత్వం, దాని ఊపిరి, దాని సామాజిక నిర్మాణం (Social Structure) పూర్తిగా మారిపోతుంది. దీని ప్రకారం రాజ్యం (State), మనిషి సార్వభౌమాధికారం (Sovereignty)పై కాక దేవుని సార్వభౌ మాధికారంపై ఆధారభూతమయి ఉంటుంది. ప్రభుత్వం దైవానిదే, శాసనం దైవానిదే, మనిషి కేవలం దైవ ప్రతినిధిగా వ్యవహరిస్తాడు.

దీనివల్ల, ప్రథమంగా మానవునిపై మానవుని ఆధిపత్యం వల్ల, మానవ శాసన నిర్మాణాధికారంవల్ల ఏర్పడే కీడులన్నీ దూరమవుతాయి. ఇంకా, ఈ సిద్ధాంతం ఆధారంగా ప్రభుత్వం ఏర్పడటం మూలాన ఉత్పన్నమయ్యే మహోజ్వలమైన వ్యత్యాసమేమంటే, ప్రభుత్వ వ్యవస్థ మొత్తంలో ఆరాధనా

భావం, భయభక్తుల తత్వం సర్వవ్యాపితమవుతుంది. పాలకులు, పాలితులు, ఉభయులూ, తాము దేవుని రాజ్యంలో ఉంటున్నామని, తమ వ్యవహారమంతా సకల గోచర అగోచర విషయాల జ్ఞానం కలవాడయిన ఆ దైవంతోనే ప్రత్యక్షంగా ముడివడి ఉందని నమ్ముతారు. ఈ ప్రభుత్వంలో పన్నులు చెల్లించేవాడు, తాను పన్నులు చెల్లించేది దైవానికే అని భావిస్తూ మరీ చెల్లిస్తాడు. పన్నులు వసూలు చేసేవారు వాటిని ఖర్చు చేసేవారు అది దేవుని సొత్తు అని, తాము దానికి అమానతుదారులమని భావించి మరీ తమ విధుల్ని నిర్వహిస్తారు. ఒక సాధారణ సిపాయి మొదలుకొని, న్యాయాధికారి, గవర్నరు, ఇంకా అత్యున్నత పాలనాధికారి వరకు పరిపాలనా యంత్రాంగంలోని ప్రతి కార్యకర్త తాను ఏ భావంతో నమాజ్ చేస్తాడో అదే భావంతో తన పరిపాలనా బాధ్యతను, డ్యూటీని నిర్వహిస్తాడు. ఇతనికి రెండు పనులు - అంటే నమాజ్ చెయ్యడం, పాలనావ్యవహారాలు చూడటం కూడా సమంగా ఆరాధనలే. రెంటిలోనూ ఒకే భయభక్తి, దైవచింతనా భావాలు అంతర్లీనమయి ఉన్నాయి. ఈ రాజ్యం పౌరులు, తమలోనుండి ఎవరినైతే దైవప్రాతినిధ్యానికై ఎన్నుకోబోతారో వారిలో అన్నిటికన్నా ముందు అన్వేషించే గుణాలు - దైవభీతి, విశ్వసనీయత, సత్యప్రియత లాంటి ఉత్తమ లక్షణాలు. ఈ విధంగా సమాజంలో అందరికంటే ఉత్తమ గుణగణాలున్న వ్యక్తులు పైకి వస్తారు. పాలనాధికారాలు ఇలాంటి వారికే హస్తగతమవుతాయి.

సంస్కృతి, నాగరికతల్లో కూడా ఈ సిద్ధాంతం, భయభక్తుల్ని, పవిత్ర గుణగణాల్ని, సత్ప్రవర్తనాతత్వాన్ని వ్యాపింపజేస్తుంది. ఇందులో స్వార్థప్రియత్వానికి బదులు దైవభక్తి మౌలిక స్థానం వహిస్తుంది. ప్రతి మనిషికీ మరో మనిషితో ఏర్పడే సంబంధంలో మధ్యన దేవుని పొత్తు వస్తూ ఉంటుంది. దైవశాసనం ఇద్దరి సంబంధాన్ని పటిష్ఠవంతం, క్రమబద్ధం చేస్తూ ఉంటుంది. ఆ శాసనాన్ని నిర్మించిన దైవం సకల మనోవాంఛలకు, స్వార్థాలకు అతీతుడు, పరిశుద్ధుడు, వివేకవంతుడు, సర్వోపరిజ్ఞాని కాబట్టి, అందులో కలతకు కల్లోలానికి దారితీసే ప్రతి ద్వారం, దౌర్జన్యానికి చేర్చే ప్రతి మార్గం మూయబడి ఉంటుంది. మానవ

నైజానికి సంబంధించిన ప్రతి అంశానికి ప్రతి మానవ ఆవశ్యకతకు అందులో చోటు ఇవ్వబడి ఉంటుంది.

## చరిత్ర ఇచ్చిన సాక్ష్యం

ఈ సిద్ధాంతం ఆధారంగా రూపొందే సామూహిక వ్యవస్థ పరిపూర్ణ రూపాన్ని చిత్రీకరించటానికి ఈ చిరు పుస్తకం సరిపోదు. అయితే ఇంతవరకు సమర్పించబడిన వివరాల ద్వారా, ఈ ప్రపంచం మరియు మనిషిని గురించి ప్రవక్తలు తెలిపిన సిద్ధాంతం ఎలాంటిదో, దానివల్ల ఉనికిలోకి వచ్చే మానవ వైఖరి ఏమిటో, దాని పర్యవసానం ఏవిధంగా రూపొందగలదో ఎవరయినా ఇట్టే గ్రహించగలరు.

ఇది కేవలం కాగితంపై రూపుదాల్చిన ఒక కాల్పనిక రూపకల్పన (Utopia) కాదన్న సత్యం కూడా అందరూ తెలుసుకోవాలి. గతంలో ఈ సిద్ధాంతం ప్రాతిపదికగా ఓ సామూహిక వ్యవస్థ ఓ సమగ్ర ప్రభుత్వం నెలకొల్పి చూపటం జరిగింది. ఆ వ్యవస్థలో ఈ సిద్ధాంతం ప్రకారం తయారయిన వ్యక్తులకు మించిన సజ్జనులు భూతలంపై మరెన్నడూ కానరాలేదు. ఆ ప్రభుత్వం ఏ విధంగానయితే ప్రజల పాలిటి కారుణ్య కడలిగా పరిణమించిందో ఆ విధమైన పరిపాలన, దానికి మించిన శ్రేయోరాజ్యం కూడా మరొకటి పుడమిపై నెలకొనలేదు. దానికి చరిత్రే ప్రత్యక్ష సాక్ష్యం. ఆ వ్యవస్థలోని వ్యక్తుల్లో నైతిక బాధ్యతాభావం ఏ మేరకు పెరిగిందంటే, ఒక ఎడారి వాసి అయిన మహిళ అక్రమసంబంధంవల్ల గర్భం దాలిస్తే, తాను చేసిన ఈ ఘోరమైన నేరానికి రాళ్ళతో కొట్టి చంపడంలాంటి భయంకర శిక్ష పడుతుందని ఆమెకు తెలిసినా, ఆమెయే స్వయంగా వచ్చి తనకు ఆ శిక్ష విధించవలసిందని ప్రాధేయపడుతుంది. ఆమెను ప్రసవం తరువాత రమ్మని ఆదేశించి, ఎలాంటి జామీను, పూచీకత్తు లేకుండా వదలివేసినప్పుడు కాన్పు చేసుకుని ఆ స్త్రీమూర్తి ఎడారినుండి తిరిగి వస్తుంది. శిక్షకై వేడుకుంటుంది. అప్పుడు పిల్లవానికి పాలుపట్టి, పాలుపట్టే వ్యవధి తీరిపోయిన తరువాత రమ్మని ఆదేశించగా ఆమె తిరిగి ఎడారి ప్రదేశానికి వెళ్ళిపోతుంది, ఆమెపై ఎలాంటి కాపలా లేదు. పోలీసు నిఘా శాఖ

భయం లేదు. కాని పిల్లవానికి పాలుపట్టే వయసు తీరిపోగానే ఆమె మళ్ళీ వచ్చి శిక్షించవలసిందని, తాను చేసిన ఆ పాపాన్నుండి ప్రక్షాళన జరిపి విముక్తం చెయ్యవలసిందని విన్నవించుకుంటుంది. అప్పుడు ఆమెకు రాళ్ళతో కొట్టి చంపే శిక్ష విధించబడుతుంది. శిక్ష అమలుజరిపాక ఆమె మరణిస్తే ఆమె మన్నింపుకై, ఆమెపై కారుణ్య వర్షానికి ప్రార్థించడం కూడా జరుగుతుంది. ఆ సందర్భంలో ఆ మహిళను గురించి ఒక వ్యక్తి నోట యాదృచ్ఛికంగా "ఎంత సిగ్గుమాలిన స్త్రీ" అన్న మాట వెడలగానే "దేవుని సాక్షి, ఆమె చెందిన పశ్చాత్తాపం ఎంత ఘనమయిందంటే, అక్రమమైన పన్నులు వసూలుచేసే వ్యక్తికూడా అలాంటి పశ్చాత్తాపాన్ని అనుభవిస్తే అతని మన్నింపు జరిగేది" అని సమాధానం ఇవ్వబడుతుంది.

ఇదీ ఆ వ్యవస్థలోని సామాన్య వ్యక్తుల పరిస్థితి! ఆ ప్రభుత్వం ఎలాంటిదో మరి!!

ఆ వ్యవస్థ నెలకొల్పిన ప్రభుత్వానికి కోట్లకొద్ది ఆదాయం ఉన్నా, దాని ధనాగారాలు ఈరాన్, సిరియా, ఈజిప్ట్ ధనంతో నిండిపోయి ఉన్నా, దాని అధ్యక్షుడు కేవలం నూటయాభయి రూపాయల వేతనం పొందేవాడు. ఆ రాజ్యం పౌరుల్లో దానం తీసుకునేందుకు ఎదురుచూచేవాడు ఒక్కడూ కానవచ్చేవాడు కాదు.

ఆ వ్యవస్థపట్ల చరిత్రకున్న అనుభవం ఇది. ఈ అనుభవం తరువాత కూడా ఎవరికయినా ఈ విశ్వ వ్యవస్థలోని యదార్థాన్ని, అందులో మనిషి స్థానాన్ని గురించి ప్రవక్తలు తెలిపిన సిద్ధాంతం సత్యమన్న విషయంలో తృప్తి కలగకపోతే వారిని సంతృప్త పరచడానికి మరే మార్గమూ లేదు. ఎందుకంటే దైవం దైవదూతలు, పరలోక జీవితాలను ప్రత్యక్షంగా తిలకించే అవకాశం మాత్రం వారికి ప్రాప్తం కాదు. ఏ విషయాన్నయితే ప్రత్యక్షంగా చూడటం సాధ్యపడదో దాన్ని అనుభవపూర్వకంగా గ్రహించడం కన్నా దాని ప్రామాణిక మయిన రుజువుకు మరోమార్గం లేదు. వైద్యుడు ఒక రోగి శరీరం లోపలి అవయవాల్లో ఎలాంటి రుగ్మత ఏర్పడిందో చూడలేకపోతే ఊహపై ఆధారపడి

విభిన్న ఔషధాలు ఉపయోగించి చూస్తాడు. అప్పుడు ఏ మందయితే రోగి వ్యాధిని నయం చేస్తుందో అదే అతని లోపలి వ్యవస్థలో ఏర్పడిన రుగ్మతకు సరయిన మందు అని నిర్ద్వంద్వంగా నిర్ధారణ అవుతుంది. అలాగే మానవ జీవితపు మిషిను మరే సిద్ధాంతంవల్లనూ బాగుపడకపోతే, కేవలం ప్రవక్తలు చూపిన పద్ధతిలోనే అది బాగుపడగలిగిందంటే అర్థం ఏమిటి? వారు చూపే సిద్ధాంతం అసలు యదార్థానికనుగుణంగా ఉందన్నమాట!

వాస్తవానికి ఈ విశ్వం అల్లాహ్ పరిపాలనలోని సామ్రాజ్యమే! ఈ జీవితం తరువాత మరో జీవితం ఉన్నదన్న విషయమూ యదార్థమే!! ఆ జీవితంలో మనిషి తన ప్రాపంచిక జీవితపు నివేదిక సమర్పించుకోవలసి ఉందన్న విషయం కూడా సత్యమే!!!

(ఈ వ్యాసం మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూది (రహ్మలై) 1941, ఫిబ్రవరి 23న ఇస్లామీయ కాలేజి, పెషావర్‌లో చదివారు. ఆ కాలేజి ఇస్లామిక్ అసోసియేషన్ ఆహ్వానంపై మౌలానా ఈ వ్యాసం చదివారు. ఇది దాదాపు ప్రముఖ ప్రపంచ భాషలన్నింటిలో అనువదించబడింది.

దీన్ని 1980లో తొలిసారిగా "గీటురాయి" వారపత్రికలో సీరియల్‌గా ప్రచురించటం జరిగింది.

ఈ చిరు పుస్తకంలో మౌలానా మహత్తరమయిన తాత్విక విషయాన్ని తార్కికంగా చర్చించారు. అయితే సామాన్య ప్రజలక్కూడా ఈ తార్కిక చర్చ అర్థం అయ్యేలా సరళమైన తెలుగు వ్యావహారిక భాషలో అనువదించి తెలుగు ప్రజలకు మౌలికమయిన ఈ పుస్తకాన్ని అందించేందుకు ప్రయత్నించాము.

పుస్తకంలో విషయం సరిగ్గా బోధపడని అంశాలు ఏవయినా ఉంటే తెలుపమని పాఠకులకు మనవి. మలి ముద్రణలో వాటిని పరిష్కరించేందుకు కృషి చెయ్యగలము. - ప్రకాశకులు).

-: సమాప్తం:-